దేశోద్ధారక గ్రంథమాల. ప్రథమ గ్రంథము

వెల. సభ్యులకు - ౪ అణాలు.

ఇతరులకు - ౬ అణాలు

## వెలువడనున్న గ్రంథములు.

౧. జాగీర్ల పరిపాలనము.
౨. దేశీయ సంస్థానములు.
౩. నిత్యజీవనమందు విజ్ఞానశాస్త్రము.
౪. ముస్తఫా కమాల్‌పాషా.
౫. గ్రామజన దర్పణము.

గోలకొండ ముద్రాక్షరశాల
హైదరాబాదు.
౫౦౦ ప్రతులు. ౧౯-౮-౧౯౩౭



శ్రీయుతులు సురవరము ప్రతాపరెడ్డిగారు

# మ న వి.

నేనుకొన్నాళ్లనుండి నొక గ్రంథమాలను స్థాపించి అఖిలాంధ్రుల ముఖ్యముగా తెలంగానావాసుల సేవజేయ కుతూహలముతో నుంటిని. కాని వార్తాపత్రికలనే నిరాటంకముగా చదువుటకు స్వాతంత్ర్యము, విజ్ఞానములేని ఈ తెలంగానావాసులవలననాకోరిక నెరవేరదేమో యను నిరాశచే వెనుకముందు లాడితిని. ఇంతలో తెలంగానా వాసులసంస్కృతిని కాపాడుటకును, విజ్ఞనవికాసమును పెంపొందించుటకును కంకణముధరించి, విజయవంతముగాతనకర్తవ్యనిర్వహణమునకు బూనుకొని నిజాంరాష్ట్రాంధ్ర మహాసభకు తోడుగా అభివృద్ధిపక్షముస్థాపింపబడుటచే వెనుకముందులుచూచుటనవసరమనితలచిముందుకేనడువ సాహసించి సుప్రసిద్ధులయిన సురవరము ప్రతాపరెడ్డి, బి.ఏ., బి.ఎల్. గారిచే విరచితమయిన "హైందవ ధర్మవీరులు". అను నీ గ్రంథమును మా గ్రంథమాల ప్రథమపుష్పముగా ప్రకటింపగలిగి నందులకు మిగులసంతోషించుచున్నాను.

పై అభిప్రాయ కారణముగనే గ్రంథమాల్యములో అభివృద్ధిపక్షసభ్యులయెడ పక్షపాతము వూనితిని. శ్రీ గ్రంథకర్త గారు ఇదివరలో రచించిన గ్రంథములన్నియు "గోలకొండ" పత్రిక చందాదారులకు ప్రత్యేక వెలతో అందజేయబడుచుండుటచే అట్టి పద్ధతినే నేను అవలంబించుట న్యాయమనిపించినది. శ్రీ గ్రంథకర్తగారి దయకారణముగ నేనీగ్రంథము మూల

మున తమకు సేవజేయ గలిగినందుకు గర్వించుచు, గ్రంథక
గారికి కృతజ్ఞత లందచేయుచున్నాను.

శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నాకు చిర
పరిచితులుగాకున్నను నేను లేఖద్వారా విన్నవించుకొనినంత
తమ అమూల్యాభిప్రాయ సమన్వితముగు ఉపోద్ఘాతమున
వ్రాసి యిచ్చినందుకు హృదయపూర్వక వందనము లర్పించు
చున్నాను. నాకు యీ విషయములో ప్రోత్సాహమిచ్చుటయే
గాక సహాయపడిన నామిత్రులకు నా వందనములు. సోమనాద్రి
పటముబ్లాకును ఇచ్చి సాయపడిన శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రి
గారికి నాకృతజ్ఞతలు. నా యీప్రథమ ప్రయత్నముపై
తమ ఆదారాభిమానముల జూపి యిట్లే రాబోవుగ్రంథముల
నెడకూడ జూపగలందుకు ప్రార్థించుచున్నాను.

సికింద్రాబాదు.
౨౨-౪౪
ఇమాంబావీధి

వట్టికోట ఆళ్వారుస్వామి

# విషయసూచిక

# పరిచయ వాక్యములు

"థర్మాపోలి" యుద్ధము ప్రాచీన గ్రీసు దేశచరిత్రలో చా
లప్రసిద్ధమయినది. గ్రీసు దేశములోని "థర్మాపోలి" కనుమయొద్ద
కొద్దిమంది యోధవరేణ్యులతో "లియోనిదాస్" అనునతడు
వేలకొలది సైన్యముతో తనదేశముపై దండెత్తి వచ్చుచుండిన
"జర్జిస్" అనురాజు విజయమార్గమును— తమకుమృత్యువుతప్ప
దని యెరిగియుండియు— తెంపరితనముతో అరికట్టి అనన్యసా
మాన్యమైన విక్రమకౌశలమును-కొద్దికాలమే అయినను జూపి-
నిరోధించినాడు. అతనిసాహసనిరోధము ఎల్లరికినిఅక్కజముగొ
లిపినది. నాటినుండి "థర్మాపోలి" సమరము ఇతిహాసప్రసిద్ధమయి
నది. దానికి సాధర్మ్యముగల విషమసమర సంఘట్టనములను దె
లుపుటకు "థర్మాపోలి" ఒకనానుడిఅయినది. "థర్మాపోలి" అన్నం
తనే విషమపరిస్థితి, సాహసము, ధైర్యము, పరాక్రమము—
ఇవియన్నియు స్ఫురణకు వచ్చుచుండును.

పైనిచెప్పినటువంటి "థర్మాపోలీ"ల కోసము యూరోపి
యచరిత్రలో పనిపట్టి వెదుకవలెనుగాని మనహిందూదేశచరి
త్రను తిరుగవేసినచో ప్రతిపుటలోను అట్టివికనబడగలవు. హిం
దూదేశము అటువంటి "జర్జిసు"లను ఎందరిని ఎన్నితడవలు ఎ
దిరించినదో లెక్కలేదు. ఒకవిధముగా విదేశీయ, విజాతీయ

చరిత్రమంతయు విదేశీయులను, విజాతీయులను, విమతస్థులను, సామ్రాజ్య నిర్మాణాసక్తులను ఎదుర్కొనిన చరిత్రమే ప్రతిఘటించిన చరిత్రమేకాని వేరొండుకాదు. పడమట అటు అఫ్గానిస్తానమునుండి తూర్పున బంగాళమువరకును, ఇటు ఉత్తరమున కాశ్మీరనేపాళములనుండి దక్షిణమున తమిళ మలయాళ దేశములవరకును ప్రతిశతాబ్దియందును ఈ ప్రతిఘటనము సాగుచునేయుండెను. హిందువులు నిర్వీర్యులును, తేజోవిహీనులును కారు; గనుకనే ఏవిజాతీయులకును, ఏవిదేశీయులకును ఈదేశము అంతసులభముగా మాత్రము లొంగినదికాదు. విదేశీయులు దీనిని జయించిరనుటకంటె దేశీయులే తమలో దాము కక్షలను, అసూయాద్వేషములను పెంచుకొని, పోరాడికొని, కపటవృత్తినవలంబించి, ఒకరికొకరు ద్రోహముతలంచి పరులవశముచేసిరనుట ఎక్కువ చారిత్రిక సత్యము. నాలుగు వందల యేండ్లు తమపట్టిన పట్టు విడువకుండ ప్రయత్నించిన పిదపగాని ఉత్తర హిందుస్థానము మహమ్మదీయులకు వశము కాలేదు; అటుతరువాత మరి రెండువందల సంవత్సరములకుగాని దక్షిణాపథము వారికి పూర్తిగా చేపడలేదు. అంతకుపూర్వము వచ్చిన హూణులు మొదలయిన వారివిషయమునను ఇంతే— ఇట్లే జరిగినది. భారతీయ శౌర్యము కణకణలాడు చింతనిప్పువంటిది. క్రీస్తు పూర్వము,మౌర్యుల కాలమునాటి హిందూధనుర్ధరుల లక్ష్య శౌర్యపరాక్రమములను గురించి ఏరియాన్ మొదలయిన విదేశీయ చరిత్రకారులు వ్రాసిన వృత్తాంతములే యున్నవి. ఆలీఢ పాదుడై ధనువు నెక్కపెట్టి, నారిసారించి, అమ్ములతోడిగిన హిందూధనుర్ధరుని ధాటి

కాగి నిలవగలవారు లేరని విదేశీయులే వచించి యున్నారు. అటువంటి పరాక్రమ మీభారతభూమిని మొక్కవోవలేదు. శాంతిసమయములందది నుస్రక్కిమ్మనట్లున్నను సంఘర్షణ సమయములయందెల్ల, అదిరాజప్రజ్వరిల్లి పగతురకు వెరపు గొలుపుచునేయున్నది. ఈ రత్నగర్భపై దాడివెడలివచ్చి, తమ మతమునుకాని, రాజ్యమునుకాని, వ్యాపింప జేయదలచిన విదేశములవారును, విజాతులవారును— అందరు నీ భారతీయ పరాక్రమమును చవి చూచియేయున్నారు. గాంధారము, పాంచాలము, రాజపుత్రస్థానము— ఇంతెందుకు, హిందూదేశము నందలి ప్రతిరాష్ట్రమును తనయందలి అడుగడుగునేలను శాశ్వతమైన, దిగంత విశ్రాంతమైన కీర్తిని, చరిత్రను నిర్మించుకొన్నదిదట కాని విదేశీయుల, విజాతీయుల వశముకావించి యుండలేదు. పంజాబు వెళ్లుడు; రాజ పుత్రస్థానము వెళ్లుడు; మహారాష్ట్రమునకు వెళ్లుడు —మరియేప్రాంతమునకు గాని వెళ్లుడు. చెవులున్నవారు ఒడలు పులకరింపజేయు ఈ వీరగాథలను వినగలరు.

అయితే, ఒక కార్యముయొక్క బాగోగులనుగాని, ఉపయోగా నుపయోగములనుగాని ధర్మదృష్టితో జూచి, ధర్మమను కొలబద్దతో కొలుచుట మన ప్రాచీన భారతీయుల స్వభావముగుటచేతను, మోక్షసాధనములు కానివెల్లని రాదరణము పాలవుటచేతను చాలవరకు మన ప్రాచీనేతిహాసము ఉపేక్షపాలయి, సారస్వతమున స్థానము గడించుకొన జాలకపోయినది. వాఙ్మయనేతల ధర్మదృష్టి కాగినచరితములు మాత్రము సారస్వతలోకమున జీవముపోసికొని వర్ధిలుచున్నవి.

అయినను, సామాన్యజనుల హృదయములను గరగించి, వారిని రంజింపజేయుచు వచ్చిన వీరగాథలు పదములుగాను, పాటలుగాను నేటికిని అధమము పల్లెసీమల యందైనను ప్రచారమున నున్నవి. ఇప్పటికిని ఆజానపదులు ఆవీరగాథలను ఆడి, పాడి, వినిఅలౌకికమును, స్వచ్ఛమును అయిన ఆనందమును పొందుచునే యున్నారు. వారికి తెలిసిన గాథలుకూడ చదువుకొన్నామనుకొను మనకు తెలియవు. మనచరిత్రము, మనశౌర్యము, మనప్రతిభ మనకే తెలియని వైనవి. నూట యేబది, రెండువందల యేండ్లుగ మనల నావరించిన పాశ్చాత్యనాగరికతా వ్యామోహము వలన "మనది" అన్నదియెల్ల మన రుచికి వెగటయినది; మన దృష్టికి కంటకమయినది. ఆకారణమున అదివరకే పండితుల దృష్టి కాగని యీవీగ గాథలు జనసామాన్యమునకుగూడ కటువయినవి. కాని ఇటీవల రెండు మూడు దశాబ్దులనుండి మన దేశమున విజృంభించుచున్న జాతీయాభిమానమువలన మరల మనదృష్టి పడుమటినుంచి తూర్పునకు అన్యమునుండి స్వీయమునకు మరలుచున్నది. మనకీర్తి ప్రశస్తులను వెల్లడించు మనవెనుకటి శౌర్యగాథలును, వీరచరితములును బయలుపడుచున్నవి. అంతేకాదు, అవిదేశీయుల దృష్టిని బహువిధముల ఆకర్షించుచున్నవి. వానిప్రభావముననే నీరసించిపోయిన మనజాతిలోకవిధమయిన యుత్సాహమును, అభిమానమును, కార్యాభిరతియు, పురోభివృద్ధినందియుత్తమపదము నందవలెనను వాంఛయు గలుగుచున్నది.

హిందూదేశమునకు సంబంధించిన ఇట్టి వీరగాథలే ఈ "హైందవధర్మవీరులు" అను చిన్ని గ్రంథమున అభివర్ణితములయి నవి. దీనిని రచియించిన శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు ఆంధ్రపాఠక లోకమునకు సుపరిచితులు. వీరు తెలంగాణము నకు చేయుచున్న సేవ అమూల్యమయినది; అపరిమితమయి నది. వీరు రచించిన గ్రంథములు — నాటకములు మొదలయి నవి — అనేకములు కలవు. వీరు ఈ "హైందవ ధర్మవీరులు" అను రచియించి ఆంధ్రపాఠక లోకమునకు నూతనముగ ఒక చక్కని సారస్వత భూషణమును సమర్పించినారు. ఇది బాల బాలికలకుకూడ సులువుగా బోధపడునట్లు సులభశైలిలో తేట తెలుగున వ్రాయబడినది. విషయమునకై పెద్దలయినవారు కూడ తప్పక చదివి ఆనందించవలసిన గ్రంథము. దీని నొక మారు చేతబట్టుచో ముగించువరకు విడువ బుద్ధిపుట్టదు; అం తటి హృదయాకర్షకముగా నున్నది.

ఈపుస్తకము కొన్నైతే చిన్నదే కాని అంతా నుసిబా రని కణకణలాడు నిప్పుకణమే. ఇందభివర్ణితములైనవన్నియు రక్తము నుడుకెత్తించు వీరకథానకములు! ఏవిషయమునను ఒకదానికొకటి తీసిపోనివి; హిందూదేశమునందలి వివిధప్రాం తముల చరిత్రలనుండి సంగ్రహింపబడినవి. హిందూదేశ చరి త్రము ఎంతటి మతసాంఘికపరిణామప్రధానమయినదో అంతటి వీరగాథాపరిపుష్టమయినది కూడను. రాజపుత్రస్థాన చరితము దివ్యమయిన ఒక వీరగీతము. సిక్కులు మాత్రము సామాన్యులా? వారి యితిహాసము రసోదంచితమయిన

ఒక కావ్యఖండము. ఛత్రపతి శివాజీమహారాజు శిక్షణమున మహారాష్ట్రులొనరించిన సాహసకార్యములు నిన్నగాక మొన్నటివి. ఇంకను జాతిసంస్మృతి పథమునుండి జారిపోలేదు. ఇట్టివారి చరిత్రలనుండి రసగుళికలనేరి శ్రీ ప్రతాపరెడ్డిగారు ఆంధ్రులకు సమర్పించి ధన్యులయినారు. వీనిలో ముఖ్యముగా సోమనాద్రిగాథ ఆంధ్రులకు ముదావహమయినది. ఎందరికి తెలియును ఈ వీరగాథ? తెలుగువారి వీరగాథ లిట్టివి కాలయవనిక మడతలలో ఎన్ని మణిగి, మటుమాయమయి పోయినవో కదా!

ఇంకను ఇట్టి గ్రంథములను రచియించి శ్రీప్రతాపరెడ్డి గారు ఆంధ్రుల దేశాభిమాన, ఆత్మగౌరవములను ఉద్దీపింప జేయవలెనని కోరుచున్నాను.

ఇట్టి గ్రంథములను పాఠశాలలలో బాల, బాలికలకు పఠనీయములుగా నిర్ణయించుట చాల ఆవశ్యకము.

మల్లంపల్లి సోమశేఖరశర్మ

# హైందవ థర్మాపోలీలు.

## థర్మాపోలి (Tharmapole.)



థర్మాపోలి యుద్ధమును, ఆయుద్ధములో తన 300 సహచరులతో బలియైనట్టి లియోనిదాసును (Leonidas) పాశ్చాత్య దేశములం దెల్లడలను విద్యావంతులలో నెరుగనివారు లేరనవచ్చును. లియోనిదాసును, అతని 300 అనుచరులను దేశ సంరక్షణార్థమై ఆత్మ బలిదానము (Self sacrifice) చేసినందున ఆదర్శపురుషులై పోయిరి. థర్మాపోలివంటి యుద్ధము లెందైన జరిగిన థర్మాపోలీయె నుపమానముగా గ్రహింపబడుచుండును. ఈ యుద్ధ విశేషములను కొన్ని మాటలలో తెలుపుదును.

యూరోపుఖండములోని గ్రీసుదేశము బహుపురాతన కాలములో మంచి నాగరికత పొందిన దేశముగా ప్రసిద్ధినొందినట్టిది. అదేశములో స్పార్టా, ఏథెన్సునగరములు సుప్రసిద్ధములు. ఏషియాఖండముయొక్క పశ్చిమభాగమందు గ్రీసుదేశ

మునకు సమీపమున నుండునది పర్షియా (పార్సీల) దేశము. ఈ పర్షియాదేశముకూడ ప్రాచీనకాలములో గొప్పనాగరిక సామ్రాజ్యమని ప్రసిద్ధిగాంచియుండెను. ఈదేశపు చక్రవర్తులు హిందూస్థానపుటెల్లలవరకు రాజ్యములగెలిచి మహాసామ్రా జ్యమును స్థాపించియుండిరి. క్రీస్తునకు పూర్వము ४८० వ సంవత్సరప్రాంతములందు అనగా నేటికి ౨४౧౭ ఏండ్లకుమునుపు పర్షియాదేశమును జర్క్సీస్ (Xerxes) అను చక్రవర్తి పరిపాలన చేయుచుండెను. అతడు సామ్రాజ్యకాంక్షచే ప్రబలసైన్యముతో గ్రీసుపై దండెత్తిపోయెను. గ్రీసుదేశమున ఉత్తరభాగమందుండు థెసలీపై మొదట దండెత్తెను. అతని నెదురొడ్డను టకు గ్రీకులు ౧००००సైన్యము మాత్రమే సమకూర్చుకొనగల్గిరి. ఆసందర్భములో జర్క్సీస్‌సైన్యమును దక్షిణమునకు రాకుండ నరికట్టుటకై కొన్నివేల సేననిచ్చి "లియొనిదాస్" అను సేనానినిపంపిరి. పారసీకుల సైన్యసముదాయమునుజూచి భీతులై చాలమంది భటులు వెనుకకు మరలిపోయిరి. కాని లియొనిదాసు తన ३०० మందితో థర్మొపోలికొండ కనుమవద్ద నిలిచి కొన్నిగంటలవరకు ఆ యిరుకు కనుమలో వేనవేల శత్రుసైన్యమును నాపియుంచెను. కాని ఆ పోరులో అందరును మరణించిరి. లియొనిదాసుయొక్కయు, అతని ३०० మంది యనుచరులయొక్కయు బలిదానము అజరామరమైపోయెను. థర్మొపోలియను చిన్నకనుమ చారిత్రిక ప్రసిద్ధిగనెను.

హిందూస్థానములో ఇట్టి థర్మొపోలీ యుద్ధములు ఒకటి

గొందుకాదు వందలకొలదిగా జరిగినవి. కాని పాశ్చాత్యప్రపంచమున నొక్కటి కూడ స్మృతిపథమందులేదు. భారతీయుల లోనే చాలమందికి తమ వీరాగ్రగణ్యుల చరిత్రలుకాని, తుదకు వారిపేరులుగాని తెలియనే తెలియనప్పుడు దేశాంతరముల వారి కెవ్వరు తెలుపబోదురు?

ఇందు వరుసగా కొన్ని (మాత్రమే) హైందవ ధర్మవ్రోలీలను పాఠకుల జ్ఞాపకార్థముగను, భారతీయుల యాదర్శార్థముగను సంక్షిప్తముగా వ్రాయుచున్నాను.



# గోరా



ఇంచుమించు ౬౫౦ సంవత్సరముల క్రిందటి చిత్తోడ్ ముట్టడినిగురించిన చరిత్ర ఇప్పటికి చాలమందికి తెలియును. చిత్తోడ్ రాజగు భీమసింగు భార్య పద్మినీదేవి అపురూప సౌందర్యవతి. ఈవార్త విన్నప్పటినుండి ఢిల్లీ రాజగు అల్లావుద్దీన్‌కు తహతహ మొదలైనది. ఈ విపరీతకాముకుడు చిత్తోడును ముట్టడించెను. చాలకాలమైనను కోట తన వశముకాకపోయెను. పద్మినీదేవిని చూచియైన పోదుననెను. తుదకు ఆమెప్రతిబింబము నద్దములోనైనను చూపరా? అనెను. అతిప్రయత్నముపై రాజపుత్రులు సమ్మతించిరి. రాజపుత్ర జాతీయధర్మముల నెరిగిన జాణ కాన అల్లావుద్దీన్ ఏకాకిగా నగరము ప్రవేశించెను. పద్మినీ ప్రతిబింబమును రెప్పవాల్పక చూచెను. "నేను మిమ్ములను నెట్లునమ్మివచ్చితినో మీరును అట్లే నన్ను నమ్మరా? నాఆతిథ్యము స్వీకరింపరా" అని భీమసింగును చేతులుపట్టి ప్రార్థించెను. భీమసింగు అంగీకరించెను. అల్లావుద్దీన్ భీమసింగుతో తన శిబిరము చేరినవెంటనే అతనిని బంధించి "నీపద్మినిని నాకునికా కట్టించుము, లేకున్న నీతలను కోటపై వ్రేలాడగట్టింతును" అని గర్జించి తర్జించెను.

మోసము! కపటము! ద్రోహము!! రాజపుత్రులు వీరావేశముపొందిరి. ప్రతియుక్తి చేసిరి. పద్మినీదేవి తనచెలి కత్తెలతో వచ్చుచున్నదని వార్త పంపిరి. అల్లావుద్దీను పెండ్లి కొడుకై పెండ్లికూతుకొరకు ప్రతినిమిషము నిరీక్షించుచుం డెను కొంతకాలములోనే గడీనుండి కొన్ని పల్లకీలు బురఖా లతో బయలుదేరి మొగల్ శిబిరముల చేరెను.

త్రుటికాలములో పల్లకీ బోయీలందరును సిపాయీ లైరి. పల్లకీలలోని చెలికత్తెలు అందరును రాజపుత్రవీరు లైరి. ఈకోటనుండి "గోరా" నాయకత్వమునను, అతని అన్నకొడు కును, ౧౨ ఏండ్లబాలుడనునగు "బాదల్" ఉపనాయకత్వము నను అదరిపడి దద్దరిల్లి రిచ్చచూపులతో చూచుచున్న మొగలు నేలపైబడిరి. కొందరు భీమసేనుని విడిపించి నగర మున కంపిరి. పోరు ఘోరమయ్యెను. ఏడెండువందల రాజపు త్రులో వేనవేలు మొగల్ సైన్యముతో ఢీకొనుచున్నారు. భీమసింగును తప్పించుకొనిపోనీయగూడదని మొగలులపట్టుదల. అతని నగరుచేర్చుట రాజపుత్రులదీక్ష. ఒక్కొక్క రాజపుత్రు డు కత్తిని ప్రచండవేగముతో త్రిప్పుచు శత్రుమూకల జొన్న కంకుల నరికినట్లు నరికి కుప్పలు వేయుచున్నాడు. కాని ఎంత కాలము? ఇంచుమించు అందరును రణభూమిపై బడిరి. భీమ సింగు తప్పించుకొనిపోయెను. అల్లావుద్దీనుకు పద్మిని దొరకక పోయెను. పిడికెడుమందియే భయంకర కోలాహలము చేసిపో యిరి. "బాదల్" బాలుడు అభినవాభిమన్యుడు. ప్రతిపక్షు భయంకరముగా పోరుచు పలుగాయములచే మూర్ఛావస్థలో చిత్తోడును జేరుకొని తన పినతల్లి—గోరావీరుని యర్ధాంగి—

మొహటనిలిచెను. ఆవీరనారికి యదార్థము స్ఫురించెను. తన నాథుడు రాలేదు. అతడు తప్పక పోలికలినికి ఆహుతియయ్యె నని గ్రహించెను. కేలమైనాపోవలేదు. ఒక కన్నీటిచుక్కను కూడ రాల్పలేదు. విషాద మందహాసముచేయుచు, "బిడ్డా, బాదల్! మీచిన్నాయనగారు యుద్ధమెట్లుచేసిరి. నాల్గుమాట లలోచెప్పి నాకు సంతృప్తికలిగించుము. వారిని కలుసుకొను టలో నేనాలస్యము చేయరాదుకదా! తెలుపుము, త్వరగా తెలుపుము" అని ప్రశ్నించెను.

బాదల్ ఇట్లు పలికెను.

"అమ్మా! ఎన్నడునులేని అనుమానము నీకీనాడు కలు గునా? మాపినతండ్రి కేవలము వీరుడేకాదు, వీరాతివీరుడు. ఆతడొక్కడే నూటిమందికిపైగా అవలీలగా హతమొనర్చెను. అతనిచుట్టే యుద్ధరంగముండెను. మంచి మంచి సర్దారులు, సుల్తానుబంధువులు అతనిని చుట్టియుండిరి. అందరిని హతమా ర్చుచు శరీరమంతయు గాయములతో నిండి అవయవములు ఛేదింపబడుచుండినను తుదివరకుపోరి ఒక అఫ్గను సర్దారుని తల నెగురమీటి, వాని మొండెమును తలగడగా, ఇతరవీరుల తన పడకగాచేసికొని దీర్ఘనిద్రనుపొందెను" "ధన్యాస్మి! ధన్యాస్మి! నాథా! ఇంకేమియు ఆలస్యముచేయను. నాయానందమునకు మేరయేలేదు! నాయనా! బాదల్ మీపినతండ్రివలెనే నీవును మహావీరుడవై, చిరాయుష్మంతుడవై దేశసేవయు, మతసేవ యుచేయుము" అని దీవించుచు, అసాధ్వీచితిలోపడి "సతి" యయ్యెను.

# అమరసింహరాథోడ్





300 ఏండ్లక్రిందటి మార్వాడ్ రాజగు రాజాగజ సింహుని పెద్దకుమారుడు అమరసింహ రాథోడు. అతడు బాల్యమునుండియే, మహా ప్రచండుడు. అందుచేతనే అతనిని తనతండ్రి రాజ్యమునుండి వెడలగొట్టెను. ఆకాలమందు ఢిల్లీసామ్రాజ్య చక్రవర్తియగు షాజహానును విధిలేక ఆ అమర సింహు డాశ్రయింపవలసివచ్చెను. అతని పరాక్రమమునకు మెచ్చి పాదుషా "నాగోరు"ను జాగీరుగానిచ్చి దర్బారులో గొప్పపదవినిచ్చెను. పాదుషా బావమరదియగు సలాబత్ ఖానుకును, అమరసింహునికిని మనస్పర్థలేర్పడెను. సలాబతు సమయమునకై వేచియుండ నది దొరకనేదొరకెను. అమరసిం హునికిని, బికానీరు రాజాకును ఒక జాగీరువిషయమున వివా దము కలుగగా పాదుషాగారు సలాబత్ ఖానునే పరిష్కర్తగా నియమించెను. సలాబతు అన్యాయముగా బికానీరుపక్షముగా తీర్పుచెప్పెను. షాజహాను అమరసింహునిపై జుర్మానావిధిం చెను. దానిని వసూలుచేయుటకుగూడ సలాబతే నియుక్తు డయ్యెను. ఇంక చెప్పవలసిన దేమున్నది. పాదుషా దర్బా రులో వజీర్లందరి సమక్షములోనే జుర్మానా చెల్లించి పొమ్మని అమరసింహుని నిర్బంధించెను.

"రాజపుత్రుని యాస్తియంతయు ఖడ్గమే. దానితో ఇదిగో ఇప్పుడే నీ జుర్మానా చెల్లింతును" అని కోపోద్రిక్తుడై సలాబతుఖానుడు తన తేలికయగు కరవాలముతో సఫాయిగా అట్టనుండి సలాబతుతలను ఫుట్టచెండువలె నెగురవైచెను. కోలాహలముతో నిండిన సభ స్తబ్ధమయ్యెను. షాజహాను కంపించుచు రాథోడును తీవ్రముగా మందలించెను. "నీకును అదే మార్గము చూపవలెనా" అని రాజపుత్రవీరుడు హుంకరించెను.

భారత చక్రవర్తికి అతని సభలోనే, సర్దారుల యెదుటనే ఇంతటి యపచారమా? అందరును కత్తులు ఝళిపించుచు రాజపుత్రునిపై బడిరి. వారతనిపై పడుచుండగనే అమరసింహుడు నాలుగుదిక్కుల అంగలు వేయుచు అందరిని కొన్ని నిముసములలోనే నేలబెట్టెను. చక్రవర్తికి భరింపరాని యాగ్రహముకలిగెను. "వీనినిపట్టుడు లేకున్న చంపుడు" అని తన యంగరక్షకభటవర్గమునకు ఫర్మాన్ ఇచ్చెను. అందరును చుట్టుముట్టిరి. కాని అమరసింహుడావంతయు చలించక తన ఖడ్గమును మెరుపుతీగెవలె నలుదిక్కులత్రిప్పుచు, త్రిప్పుతిప్పునకు నొకకొందరిని మట్టుపెట్టుచువచ్చెను. ఇక ఎదిరించువారు లేరు. చక్రవర్తి తక్తు (పీఠము) పై గజగజవణకుచుండెను. రాజపుత్రసింహము ఒక్కగంతుతో పాదుషా సింహాసనముపై పడెను. పాదుషా శీఘ్రబుద్ధితో పలాయితుడై తన జనానాలోని కురికి తల దాచుకొనెను.

అప్రతిహతవీరుడగు అమరసింహుడు సింహమువలెనే రక్తరంజితమైన దర్బారురంగమున వీరవిహారము చేయదొడగెను. నానకలిగిన భటులు కుందేళ్ళవలె మూలమూలలందు

ఒదిగియుండిరి. గంభీరముగా, ప్రశాంతముగా నతడు కోటదాటి ఇల్లుచేరుకొనెను.

మరునాడు మరల దర్బారు. ప్రాతవజీర్ల స్థానములో క్రొత్త వజీర్లు. వారిమధ్యన నొక ఆకుల బీడా బంగారు తట్ట లోనుంచినారు. అమరసింహుని తలనుకోసికొనువచ్చు వీరుడే ఆబీడాను తీసికొనవలసియుండెను. వజీర్లు, సర్దార్లు ఒకరిమొగ మొకరు చూచుకొని అందరును తలవంచుకొనిరి.

"నాదర్బారులో అందరును గాజులుతొడుగు కొన్నవారేనా"

అంతయు నిశ్శబ్దమే.

"మీరందరును నపుంసకులేనా"

ఎవ్వరును తలలెత్తలేదు.

"ఇంత మందిలో నొక్కడైనను మగవాడు లేకపోయెనా?" అని పాదుషా వాపోయెను.

తుదకు "అర్జున" అనువాడు బీడాపై చేయిపెట్టెను.

"అర్జున! అర్జున! అమరసింహుడు నీబావ. నీవు చాల వాడవు. నీసాహసమునకు మెచ్చితిని. కాని నీచిరుతవయస్సు బట్టి నీకు మరల బీడాను విడిచిపెట్ట ననుమతియిచ్చుచున్నా ను." అని పాదుషాపలికెను.

"చిత్తము, హుజూర్. నాకేమియు భయములేదు. నున్నానొసగుడు."

అర్జున బావమరదియైనను అమరసింహునిపై చాల కాలమునుండి ఈర్ష్యాళువైయుండెను. అర్జునచల్లగా బావగారి

యింటికరిగి చక్రవర్తికిని, నీకును సంధిచేయుదుమని బహువిధ ముల ప్రార్థించి, యొప్పించి యమరసింహుని తనవెంట దేవిడీకి పిలుచుకొనిపోయెను. అభిమానియగు అమరసింహుడు చక్ర వర్తికి వంగిసలాము కొట్టడని అర్జునముందే ఆలోచించుకొని చక్రవర్తియెదుటి ద్వారమును చిన్నదిగా ఏర్పాటుచేయించి యుండెను.

"నేను ఈద్వారములో వంగిపోను" అని అమరసిం హుడు నిరాకరించెను.

"అట్లైన కాళ్లుముందు లోపలికిపెట్టి దూరుము" అని అర్జున ఉపాయముచెప్పెను.

"అది యొకవిధముగా అంగీకరింపవచ్చును." అనుచు అమరసింహుడు ముందు కాళ్లుపెట్టి సగము శరీరమును ప్రవేశ పెట్టగనే ద్రోహియగు అర్జున అతనిఎదలోపొడిచెను. మరణా వస్థలో సహితము అమరసింహుడు నీచద్రోహి(అర్జున)పై కత్తి విసరెను. ఆదెబ్బతో అర్జునముక్కలై యెగిరిపోయెను. ముక్కలైన అర్జున వీరమరణమునొందిన అమరసింహునితలను కోసి కొని పాదుషావద్దికి తీసికొనిపోయెను.

పాదుషాకు ఈముక్కడి చర్యలు తెలిసినవెంటనే క్రుద్ధు డై బంధుమిత్రద్రోహుల కందరకు గుణపాఠముగానుండుటకై వానిముఖమునకు మసిపూయించి, గాడిదపైనెక్కించి, రాజ వీధులలో ఊరేగించి తర్వాత తలగొట్టించెను.

# భల్లూసింగ్



అమరసింహుడు అమరలోకమున కేగెననువార్త అతని భార్యయగు హరీరాణికి తెలిసెను. ఆమె సహగమనముచేయ సమకట్టెను. కాని భర్తశరీరమును షాజహాన్ చక్రవర్తియొక్క "లాల్‌కోట" నుండి తెచ్చువారెవరు? అమరసింహుని భ్రాతృజుడగు రామసింగు సంసిద్ధుడయ్యెను. అతడింకను బాలుడే. పరివారమా నూర్గురుమాత్రమే! అతని ప్రయత్నము నిరర్థకమేయగునని హరీరాణి నిషేధించెను.

అమరసింహుని తమ్ముడు భల్లూసింగు. అన్నదమ్ములిద్దరెన్నడో కలహించుకొనియుండిరి. అయిన నేమాయె? ఇప్పుడాపత్కాలము. హరీరాణి భల్లూసింగునకు ఒక జాబు వ్రాసి తన భర్త కళేబరమును తెమ్మని ప్రార్థించెను. భల్లూసింగు ఆందోళనమున చిక్కెను. క్షాత్రధర్మము నిర్వహింపవలెనా? తనకది క్షేమకరముకాదు. అయినదేమో అయినది. ఇప్పుడా స్త్రీకై యింత యవస్థపడనేల? యని తుదినిర్ణయము చేసుకొనెను. అతని(భల్లూసింగు)భార్య కల్తీలేనిరాజపుత్రి. తన భర్తయొక్క నిశ్చయము నెఱిగినవెంటనే యిట్లు తూలనాడెను.

"స్వామీ! మీకు కత్తి తాకుడు సరిపడనట్లున్నది. ఈ చిన్నపనికి మీకెందుకు శ్రమ? తాము మనపిల్లల లాలించుచు ఇంటనే నీడలోనే కూర్చునుడు. మీయుద్ధకవచాదులను, ఖడ్గమును నాకిమ్ము పోయివచ్చెదను."

ఈమాటలు సూటిగా బల్లెముపోటువలె భల్లూసింగు నెదలో నాటుకొనెను. మారుపలుకక లేచెను. యుద్ధసన్నద్ధుడయ్యెను. ౬౦౦ మంది అతని వెంట నడచిరి. ఢిల్లీనగరసమీపములో యుద్ధసమాలోచనముచేసిరి. భల్లూసింగు ౫౦౦ భటులతో శవమును తెచ్చుటకు పోవునట్లును, నగరమువెలుపల రామసింగు ౧౦౦ మందితో చితి సిద్ధముచేసి యుంచుటను, నిశ్చయింపబడెను.

భల్లూసింగు తన పరివారమునకు క్షాత్రధర్మమునువీడక, ప్రాణములపై నాశపెట్టక తమ సంకల్పమును నెరవేర్చుటకై పురికొల్పుచు నగరమున ప్రవేశించెను. నగరద్వారమువద్ద శిపాయీలపైబడి, వారిని హతమొనర్చి, లాల్‌కోటనుజొచ్చి అమరసింగు శవముండుతావును జేరిరి. భల్లూసింగు భక్తితో తన యన్న శవమునెత్తికొని గుర్రముపైనుంచికొనెను. ఇంతలో నగరమందు కోలాహలమయ్యెను. పాదుషా సైన్యము తొందరతొందరగా వచ్చిచేరెను. వేలకొలది సైన్యముచుట్టినను ఈ ౫౦౦ మంది తమ ద్విధారాఖడ్గములను విసరుచు కుప్పలుపడ శత్రుమూకను నరకుచు ద్వారమును సమీపించిరి. రాజపుత్రవర్గము సన్నగిల్లుచుండెను. పాదుషాసైన్యములువచ్చి చేరుచుం

డెను. భల్లూసింగు నగరద్వారముదాటెను. ద్వారమువద్దనే అందరును "శత్రువులనరికట్టుడు" అని ఆజ్ఞాపించి తనవదినె యగు హరీరాణికీ త్రుటికాలములో తన యన్న శరీరమును సమర్పించెను. చితిమండుచుండెను. హరీరాణి తనభర్తను తన యొడిలో నుంచుకొని చితిలో కూర్చునెను.

ద్వారమువద్ద రాజపుత్రులందరును చంపబడిరి. మొగలుసైన్యము చితినిసమీపించెను. చితిచుట్టును భల్లూసింగు, రామసింగు, మిగిలిన ౧౦౦ మందితో కోటవలెనిలచి యుద్ధము చేయమొదలిడిరి. క్రమక్రమముగా ఒకరివెంట నొకరు మరణించిరి. భల్లూసింగు పెక్కుగాయములచే కూలబడెను. కాని చితినిచూచి తమశ్రమ, తమబలిదానమంతయును వ్యర్థమయ్యేనేమోయని విషాదముతో తహతహపడజొచ్చెను. చితివద్దనుండిన పురోహితుడదిచూచి భల్లూసింగుతో చితిపూర్తిగా కాలినదనియు, ఇంకే సందేహమును వలదనియు చెప్పెను. ఆ మాటలువిని భల్లూసింగువదనము ప్రశాంతమయ్యెను. చిరునగవుతో ప్రాణములవదలెను. అతనిచేతిలోని కత్తి పురోహితుడు లాగుకొని చచ్చిపడువరకు యుద్ధముచేసెను.

౬౦౦ మంది యుద్ధములో హతమైరి. వేలకొలదిసైన్యముండినను చక్రవర్తి సమక్షముననే అతనియాస్థాననగరమందే ఈకొలదిమందిచేసిన భీభత్సము నగరముపై సందెచీకటితో పాటు యావరించుకొనిపోయెను. చితికాలిన తావు బొఖారా

దర్వాజావద్ద. ఆదర్వాజ "అమరసింహదర్వాజా" అని నూతన నామకరణము కలిగెను. తమ పరాభవచిహ్నముగా ఆద్వారమును శాశ్వతముగా మూసివేయవలసినదని చక్రవర్తి యాజ్ఞాపించెను. ఆదర్వాజ మొన్న మొన్న క్రీ. శ. ౧౮౬౬ లో కెప్టెన్ జార్జిస్టీల్ ఉత్తరుచే తెరువబడెను

అమరసింహమహావీరుని యశోగానము నేటికిని అజరామరముగా రాజపుత్రస్థానమందు పల్లెపల్లెలో చేయబడుచున్నది.



# ఇందుమతి



మార్వాడ్ సీమ హిందువులకు పవిత్రక్షేత్రమై యుండదగినది. కాని యదేమిచిత్రమో హిందువులు అనేక తీర్థస్థలాలను దర్శించుకొందురు కాని హిందూ మతరక్షణార్థమై బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు, రాజులు, రాణులు అందరును రెండు మూడునూర్ల యేండ్లవరకు తమ ప్రాణములను బలిగా నర్పించుచు వచ్చినట్టి దివ్యక్షేత్ర రాజమగు మార్వాడును నే డెవ్వరును చూడగోరరు.

ఈ మార్వాడ్ రాజ్యపు రాజులలో అమరసింహుడు, భల్లూసింగు ఎట్లు తమ తమ యవక్ర విక్రమమును ప్రపంచమునకు ప్రకటించిరో యది యెన్నిమారులు వినినను తనివి తీరని చరిత్రమైయున్నది.

అమరసింహుని తమ్ముడే జస్వంతసింగు. ఇతడు ఔరంగజేబుఆలంగీరు పాదుషా కాలమువాడు. ఇతనిపరాక్రమము ఔరంగజేబు పలుమారులు చవిచూచి నష్టపడియుండెను. రెండు, మూడు మారులు ఔరంగజేబుయొక్క సైన్యమునే యోడించి యుండెను. ప్రతిపర్యాయము ఆలంగీరాతనికి ఉన్న తపదవు లిచ్చుచునే వచ్చెను!

"ప్రయోజనాపేక్షతయా ప్రభూణాం ప్రాయశ్చలం
గౌరవ మాశ్రితేషు"

ఔరంగజేబువంటి రాజనీతిజ్ఞుడు భారతదేశమున పుట్టలేదు. బహుశా ఇకపుట్టడేమో! చతురుపాయములకు ప్రతిపక్షవీరుడు లొంగకుండిన నతనివద్ద పంచమతంత్రమొకటి యుండెను. అది ఒక చిన్నచిట్కా! విషముపెట్టుటయే! ఈ ప్రయోగము మన జస్వంతసింహునిపై ప్రయోగించెను. జస్వంతసింహుని పెద్దకుమారుడు కంటకుడేయుని తన యాస్థానమునకు పిలిపించికొని హసన్ముఖుడై, బాగుగాఆదరించి మన్నించి, ఒకమంచి కవచమును బహూకరించి, తనయెదుటనే ధరింపఁ గోరెను. ఒక ఘడియలో ఆ యువకుడు విషదిగ్ధమైన కవచముచే ఘోర మరణమునొందెను.

జస్వంతసింహుని స్నేహితుడగు అంబరుపాలకుడగు మిర్జారాజాకును నిదే ప్రయోగము కావించెను.

జస్వంతసింహుని మరియిరువురు కుమారు లదివరకే మడసియుండిరి. జస్వంతునిభార్య ఇందుమతి శూరనారి. ఒక తడవ యుద్ధములో తన పరివారము హతముకాగా భర్తయగు జస్వంతు డొక్కడే గాయములతో మార్వాడు రాజధానికి తిరిగివచ్చినవార్తవిని ఇందుమతి నగరద్వారములను బంధించి, "నాభర్త పిరికివాడుకాడు. రణరంగములో వీపుచూపువాడునుకాడు. ఈ వచ్చిన పిరికివాడెవ్వడో నేనెరుగను" అని తూలనాడి, మువ్వురించి, కూర్చుండినట్టి వీరాంగన. ఔరంగజేబు

యొక్క మిత్రద్రోహముచేతను, విషప్రయోగముచేతను తన భర్త చనిపోగా తానును సహగమనము చేయ నుద్యుక్త యయ్యెను. కాని ఆమె గర్భవతిగా నున్నందున అందరును వలదని ప్రార్థించిరి. కొంత కాలమున కామె లాహోరు నగరములో "అజితసింహుని" కనెను. శిశువునుతీసికొని మార్వాడు వెళ్లుటకు అమెయు, ఆమె వెంటనుండిన ౨౫౦ మంది పరివారమును సంసిద్ధులైరి. ఢిల్లీమార్గమున పోవలసివచ్చెను. ఈ శిశువునుగూడ తన ప్రసిద్ధమూలికా ప్రయోగముననో, మరియెట్లో హతమొనర్చుటకై ఆలంగీరు చక్రవర్తి నిశ్చయించి యుండెను. మార్వాడువీరులకు ఈ బాలు డొక్కడే మిగిలిన రాజవంశాంకురము. ఈ ౨౫౦ పరివారమునకు పాదుషాగారి చేయని వాగ్దానములు లేనేలేవు. తర్జనభర్జనములతోను, లంచముల తోను, జాగీరుసనదు ప్రదానములతోను, తుదకు "మీవాడు" రాజ్యమే అందరివశము చేయుదుననునాశతోను—తనకు తోచిన సకలనీతి విధానముల నన్నింటను వారిని భ్రమపెట్టెను. కాని ఈ ౨౫౦ మందియెదుట మృత్యుదేవతా స్వరూపము తాండవించు చుండినను, ఒక్కరైనను ద్రోహమునకు సిదపడకపోయిరి.

తుదకు ౫౦౦౦ భటులతో ఫౌలాద్ఖాన్ అను మొగల్ సేనాని రాజపుత్రుల గుడారములను చుట్టుముట్టి ముట్టడించెను. వీరి రాకను ముందే యెరిగినందున ఇందుమతి తన శిశువును ముకుందదాసఖిచీ అను విశ్వాసివెంట బంపియుండెను. ఫౌలాద్ ముట్టడించినవెంటనే రాజపుత్ర శిబిరములో

నుండిన స్త్రీలు అగ్నిలోబడి భస్మమైరి. ఒక్క ఇందుమతి మాత్రమే స్త్రీలలో మిగిలియుండెను. ఆమె వెంట దుర్గాదాసు రాథోడ్, రఘునాథదాసుభట్టి, హరనాథసింగు, రంఛోడ్దాసు అనువీరులును, తక్కిన పరివారమును అంతయునుకలిపి ౨౫౦ యుండిరి. ఇందుమతియు, ఆమె భటులును ౫౦౦౦ శత్రు సైన్యముపై బడిరి. పోరు ఘోరమయ్యెను. మొగలులకు సంఖ్యాబలముచే నిర్లక్ష్యము. రాజపుత్రులకు ఆత్మీయ శక్తిసామర్థ్యములందలి విశ్వాసముచే నిర్భయము, పైగా మృత్యువునే లెక్కపెట్టని వారు. ఇందుమతి సైన్యాగ్రముననే యుండెను. తన పట్టాకత్తిని తీవ్రముగా ప్రయోగించుచు, సమరాశ్వమును మొగలు సేనలో నురికించుచు, కంఠముల తెగమీటుచు, శత్రుసేనలో సందుచేసికొని పోవుచుండెను. ఆమెనే లక్ష్యముగా నుంచికొని ఇతరవీరులును పోరుచు, శత్రుమూకను ప్రచండ వాతోద్ధూత పర్ణరాశినిబోలె చెదరగొట్టి తప్పించికొని వెళ్లి పోయిరి. కాని ౨౫౦ మందిలో ౨౦౦ మందికి పై హతమైరి. గాయములతో చావక మిగిలిన వారిలో మహారాణి ఇందుమతియు, ముందు ప్రసిద్ధుడు కానున్న దుర్గాదాసు రాథోడును, ఠాకురుహర నాథసింగును నుండిరి.

ఒక స్త్రీ తన వేలకొలది సైన్యమును ఓడించి తప్పించుకొని పోయెనన్న వార్త విని ఆలంగీరు తహతహకు అంతమే లేకపోయెను.

# సావిత్రీబాయి



మహారాజా శివాజీ దక్షిణ హిందూస్థానదిగ్విజయ యాత్రకై 20,000 సైన్యముతో వెడలి తంజావూరు వరకు రాష్ట్రము లన్నియు జయించుచు వెనుకకు మరలివచ్చెను. వేలావతీ నదీతీరము పొడవున వెళ్ళుచు బళ్ళారిని సమీపించెను. ఇప్పటి రాయలసీమలోచేరిన బళ్ళారి మొదటిపేరు బేలవాడి. బేల్ అనగా బిల్వము. పవిత్ర బిల్వక్షేత్రము అని బేల్‌వాడీకర్థము. ఈపదమే అపభ్రంశముపొందిబళ్ళారిగా పరిణమించినది. ఆకాలములో బళ్ళారిఒక "పాలె"గారిపరిపాలనములో నుండెను. శివాజీ సైన్యము నగర పరిసరములందు విడిసియుండగా బళ్ళారిపాలెగారు నిష్కారణముగా శిబిరములపైబడి కొందరిని చంపి, కొన్నిబండ్లపై సామగ్రిని, కొన్ని గుఱ్ఱములను పట్టుకొని పోయెను. మహారాజు క్రుద్ధుడై బళ్ళారిని ముట్టడివేసెను. కోటలో తినుబండారము కావలసినంత యుండుటచేతను, కోటగోడలు ప్రబలమైనవగుటచేతను ముట్టడివేసి కూర్చొనటవలన కాలహరణ మగునని మహారాజులుంగారు కోటపైబడి, గోడలను ద్వారములను పగులగొట్టుటకై సేనకాజ్ఞాపించి, తాను కొందరిని తీసికొని కోటవద్ది బయటి యిండ్లను తగులబెట్టెను. ఆయిండ్లనుండి జ్వాలలు బయలుదేరగా కోటలోని

వారు సంచలించి దిగ్భ్రమచెందిరి. ఈ సందడిలో తన సైన్యము కోటగోడల నెగబ్రాకెను. పాలెగారు తనసైనికులను బురికొల్పుకొనుచుండగా శివాజీసైనికు లతనిపైబడి నరికివేసిరి. బళ్ళారిసైన్యము భీతిల్లి పారిపోజొచ్చెను. ఆక్షణములో పాలెగారిభార్యయగు సావిత్రీబాయి తన భర్త చచ్చినందులకై సామాన్యులవలె దుఃఖించుచు కూర్చొనక తన భర్తయొక్క పసురాశ్వము నెక్కి, డాలు ఎడమచేతను, కత్తిని కుడిచేతనుబట్టి పారివచ్చు తన సైన్యము నరికట్టి తనవెంట రమ్మని పురికొల్పు కొనుచు శివాజీ సైన్యముపై మహా ప్రవాహమువలె ముంచి కొనివచ్చి అనేకుల బడగొట్టి తక్కినవారిని కోటనుండి బయటికి తరమెను. శివాజీ సైన్యము దిగ్భ్రాంతిచెందెను. ఆవీరనారి ౨౬ దివసములవరకు నిరంతరముగా యుద్ధముచేయుచు మహారాష్ట్రసైన్య వారాశికి చెలియలికట్టయై నిలిచెను. ఇరువదియేడవ దినమునాడు మహారాష్ట్రులు ప్రధాన ద్వారమును పగుల జీల్చి కోటను ప్రవేశించి వశపరచుకొనిరి. తన సైన్యము హాతమై చెదిరిపోయి, పట్టుపడి, భిన్న భిన్నమైనది గుర్తించి సావిత్రీబాయి యుద్ధము చాలించెను. ఆమెను శివాజీ వద్దికి గౌరవముతో గొనివచ్చిరి. శివాజీ మహారాజు ఆమెకు వినయపూర్వకముగా నమస్కరించి గౌరవించి "తల్లి, ఇది క్షాత్రధర్మము, నీకు కలిగిన విపత్తునకై నాకు పరితాపము కలిగినది." అని అనునయవాక్యములచే ఓదార్చి ఆమె తన సామంతవర్గములో చేరియుండునట్లు ఒప్పించి కోటను మరల ఆమెకు వశపరచి తుంగభద్రానదిని దాటి సహ్యాద్రిపర్వతముల చేరుకొనెను.

# బాజీ దేశపాండ్యా



ఛత్రపతి శివాజీ మహారాజు తనపై ప్రబల సైన్యముతో దాడివచ్చిన అఫ్జల్‌ఖానును చంపి వాని సైన్యము నోడించినవార్త బిజాపూరులో చావగామిగిలి పారివచ్చిన సిపాయీలవలన తెలియగా నగరమంతయు రాగి ప్రమాకువలె సంచలించిపోయెను. అఫ్జల్ఖాను, బిజాపూరు సుల్తానగు అలీ ఆదిల్‌షాకు తమ్ముని వరుసవాడు. ఆదిల్‌షా తల్లి కొన్ని దినములు ఈవ్యసనముచే కూడుదినక నేలబట్టెను. అవమానమా భరింపరానిదయ్యెను. హబ్షీ (Abyssinian) సిద్దీజోహర్‌కు సైన్యాధిపత్యమిచ్చి ౧౦౦౦౦ గుఱ్ఱపువార్లను ౧౫౦౦౦ కాల్బలమును వెంటనిచ్చి శివాజీ నోడించి బందీగా పట్టుకొనివచ్చుటకై సుల్తాను ఆజ్ఞాపించెను. ఇంతటి గొప్పసైన్యముతో సిద్ధీజోహారు సేనాని ప్రయాణమై శివాజీఛత్రపతి కొలదిసేనతోనుండినట్టి పణహాలాకోటను ముట్టడించెను.

పణహాలాకోట ఇప్పటి కొల్హాపూరునకు సమీపములో నుండునట్టిది. వానకాలము సమీపించిన వెంటనే జోహర్ ముట్టడియెత్తివేయునను నాశతో శివాజీ యుండెను. మహారాష్ట్రులారితేరిన తమకూటయుద్ధములు (Guerilla warfare) మొదలు పెట్టిరి. కొండలచుట్టునుండు మావళీలు రాత్రులందు

జోహారు సేనపై పడి వీలైనంతవరకు శత్రువుల తునుమాడి వెంట నే కొండచరియలలో మాయమగుచుండిరి.

వర్ష కాలము ముంచుకొనివచ్చెను. ధారాపాతముగా వర్షములు కురియజొచ్చెను. కాని మూడు నాలుగు మాసము లైనను సిద్దీజోహారు తన ముట్టడిని వదలలేదు. తుదకు ఒక నాడు శివాజీ తాను సంధిచేసుకొన గోరినట్లు వార్తనంపెను. సిద్దీజోహారున్ను, శివాజీయున్ను కలసి సంధివివరములనుగురించి చాల సేపుమాట్లాడి మరునాడు ఒప్పందలను అంగీకరించుటకై నిర్ణయించుకొనిరి. తుదకు శివాజీవశంవదుడయ్యెనని బిజాపూరు సైన్యము సంతోషముతో మైమరచెను. సైన్యములో జల్సా (విందు)లు మెండయ్యెను. అశ్రద్ధ యెక్కువయ్యెను. ఇచ్చట శివాజీకి చింతాభరముచే నిద్దురపట్టలేదు. మధ్యరాత్రివేళ ఆప్తులగు కొలదిమందిభటులతో కోటయొక్క దొంగదిడ్డిలనుండి బయట పడి నిశ్శబ్దముగా పశ్చిమాభిముఖుడై ౮౦ మైళ్లదూరములో నున్న విశాలగడీకోటకు శివాజీ ప్రయాణమయ్యెను. మార్గ మంతయు పర్వతమయము. ౬౦ మైళ్ల దూరమే యున్నను గంటకు ౨-౩ మైళ్లకన్న నెక్కువగా నడువజాలరు. తెల్లవారు వరకే బిజాపూరు సైన్యములో శివాజీ పారిపోయినవార్త వెల్లడియయ్యెను. అఫ్జల్‌ఖాను కుమారుడు ఫజల్‌మహమ్మదు అనువాడు జోహారు సేనానితో గూడి తనతండ్రిని జంపినవానిపై పగతీర్చుకొనుటకై వచ్చియుండెను. శివాజీ పారిపోయెనన్న వార్త వినినవెంటనే ఒక సైన్యదళమును తీసికొని మహావేగ

ము౯ిగ్ వెన్నంటి విశాలగడీ యింకను ౬ మైళ్ళదూరములో నున్నదనగా శివాజీని అతని యనుచరులను సమీపించెను.

ఆపత్సమయములందే శివాజీ బుద్ధిచాకచక్యము పరిణతి పొందునట్టిది. ఆ వచ్చుశత్రుసైన్యమును ప్రాణములలో నరికట్టుటకై కొందరి "మావళీల"ను (మహారాష్ట్రములో యుద్ధకాలమందు భటులుగామారుచుండిన వ్యవసాయకులు) బాజీ దేశపాండ్యా నాయకత్వమున నియమించి తాను విశాలగడీచేరినవెంటనే అయిదుమూగులు ఫిరంగిధ్వనులను కావింతును అని చెప్పిపోయెను.

బాజీదేశపాండ్యాకు "బాజీప్రభు" అనియు అపరనామధేయము. ఈశూరాగ్రేసరుడాదినమున ప్రకటించిన యపూర్వ యుదకౌశలము ప్రఖ్యాతవీరుల చరిత్రములలో అగ్రస్థానము వహించునట్టిదై యున్నది.

ప్రాచీనములోని గ్రీసు దేశపు లియొనిడాను తన 300 మందితో౯ిగ్ మరణించిన థర్మాపోలీరంగము పెద్దపర్వతములోని యొక ఇరుకుకనుమ. బాజీదేశపాండ్యా తనకొలది పాటి భటులతో యుద్ధముచేసిన స్థలముననో చిన్నగుట్టలుండెను. వానిమధ్య విశాలమైన స్థలముండెను. ఆస్థలమును పంఢర్‌పాని (తెల్లనినీరు) అనిపిలుతురు. ఆగుట్టలమధ్య పెద్దవాగు ప్రవహించుచుండెను. అట్టిపంఢర్‌పానీ రంగమందు బాజీదేశపాండ్యాను ఫజల్‌మహమ్మదు తనసేనలతో ఢీకొనెను.

బాజీకేవలము వీరవరుడేకాడు, అపూర్వయుద్ధ కళానైపుణ్యముకలవాడు. యుద్ధకళలో వరుసలువరుసలుగా సైన్య

ముల తీర్చినడపించుటను పాశ్చాత్యులు కనిపెట్టిరి. మొదటివరుసలోనివారు పడిపోయినప్పుడెల్లను రెండవవరుసలోనివారు ఆ స్థానమును పూరించుటకై యీనియమముచేసినారు. బాజీ ప్రభువు ప్రకృతావసరమునుబట్టి క్రొత్తపద్ధతి కనిపెట్టినాడు. తనభటుల నందరిని వలయాకారముగా నిలిపినాడు. బయటి వలయమువారు చనిపోయిన లోపలివలయమువారు ఆస్థానములో వచ్చి చేరుటకై యేర్పాటుచేసెను. ఇట్లు చేయుట యేలన శత్రుసేన అపారము. వారు తమను చుట్టుముట్టిన తాము సంఘీభావముతో నుండగలరు.

పోరు సంకులమయ్యెను. మొదటిదళమును అవలీలగా బాజీనరికివైచెను. మరల రెండవదళము చుట్టుకొనెను. అదియు తరుమగొట్టబడెను. మిట్టమధ్యాహ్న కాలమయ్యెను. మావలీలలో తమనాయకుడగు బాజీ శౌర్యాగ్ని వ్యాపించుకొనెను. ఒక్కరును సంచలించరు. సంఖ్య తగ్గుకొలది సాహసమెక్కువగుచుండెను.

జోహారుసేనానిచే వెనుకనుండి పంపబడిన సైన్యదళములు మరికొన్ని చేరుటచే భీతాత్ములైన ఫజల్ మహమ్మదు సిపాయీలకు ఉల్లాసమినుమడించెను. "అల్లాహూ అక్బర్" అని కేకలిడుచు ద్విగుణీకృతోత్సాహముతో వారందరును దేశపాండ్యాను, అతనియనుచరులను చుట్టుకొనిరి. దేశపాండా సిబ్బంది సంచలించెను. వీరిభయమును బోగొట్టుటకై దేశపాండ్యా అత్యంత భయంకరముగా యుద్ధము చేయదొడగెను. శత్రుసేనలలో ఎదుట పడినవారినందరిని నరుకుచుండెను.

తాను పలుగాయములచే గాసిలెను. కాని యింకను ఫిరంగీ ధ్వని వినబడలేదు. తన ఏలికయింకను విశాలగడీచేరలేదు. ప్రాణాపాయకరములగు గాయములను గూడ లెక్కసేయక పోరుచుండెను.

అంతలో అయిదుఫిరంగీధ్వనులు దిక్కులు పిక్కటిల్లు నట్లుగా మావళీలకు సంతసమును, బీజాపూరుసైనికులకు నిర్వే దమును కలిగించుచు ధ్వనించెను. "నాయేలిక యాజ్ఞాపరిపాల నము పూర్తి అయినది. ఇంక ఈబాజీ సుఖముగా ప్రాణముల వీడుచున్నాడు" అని పల్కుచు బాజీ ప్రసన్నవదనముతో రణభూమిపై పడిపోయెను. మావళీలు అతని కళేబరమును ఎత్తికొని విశాలగడికి ప్రయాణము సాగించిరి. ఆనాడు దేశ పాండ్యాయు, అతని మావళీ వీరులును చూపిన చండశౌర్యము శత్రువుల భయాజర్జరితులనుగా జేసెను. మావళీలు తమనాయ కుని శరీరమును తీసికొనుపోవుచుండ బీజాపూరుయోధులు అడ్డుపచ్చుటకైనను ధైర్యముచాలనివారైరి. శివాజీ తన విశ్వాసపాత్రుడైన బాజీశవమునుజూచి అఖండముగా కన్నీరు కార్చుచు అత్యంతముగా దుఃఖించెను.



# తానాజీ మాలుసురే





వీరమాత జిజాబాయి ఒకనాడు దంతెపుదువ్వెనతో తల దువ్వుకొనుచు తన ప్రతాపగడ్ కోట పైనుండి తూర్పు దిక్కుచూడగా మధ్యం దినమార్తాండుని కిరణ ప్రసారముచే నిగనిగమని తెల్లని మేడలతో కోడిగ్రుడ్డువలె మెరయుచు సింహగడ్ కోట దూరమందు కనుపించెను. ఆదిక్కు అట్లేచూచుచుదీర్ఘాలోచననుండివిషాదములోబడినిన్న మొన్నటివరకు మావశమందుండి నేడు మామతద్వేషియగు ఔరంగజేబు వశమయ్యెగా అని క్రమముగా క్రోధావేశముపొంది వెంటనే యొక సవారును "రాయగడ్‌లోనున్న తనకుమారుని ఛత్రపతిశివాజీమహారాజును తక్షణమే యెట్లున్నవానినట్లే, భోజనము చేయుచుండినను మానుకొని చేయియైనను కడుగు కొనక, రావలసినదిగా నాయానతి వినిపించుము పొమ్ము" అని యాజ్ఞాపించెను. మాతృవాక్య పరిపాలకుడగు శివాజీ అన్ని పనులను సదలుకొని వార్త వచ్చిన వెంటనే పయనమై వెళ్ళి, తన తల్లి కాళ్ళపై తలవాల్చెను. జిజాబాయి కొడుకును సర్వ దిగ్విజేతవుకమ్మని దీవించి తనతో పాచికలాడుమని నిర్బంధించెను. శివాజీ నిరాకరించెను. జిజాబాయి స్వభావముచే పట్టిన పట్టు వదలనట్టిధీర. ఒప్పుకొనక తప్పదయ్యెను. పందెములో శివాజి ఓడిపోయెను. "అమ్మా పందెము నీవేగెలిచితివి. నీ యిష్టమున్న కోటను తీసికొనుము" అని పలికెను.

"నాకు సింహగడ్ కోటయే కావలెను. దానిని నావశ ముజేయుము." అని తల్లికోరెను.

"అదిప్పుడు నాతో కానిపని".

"అయితే నేనుపిరికివాని తల్లిననియా నీ యభిప్రాయము"

"అదికాదు. ఆకోట అత్యంత దుర్భేద్యమైనది. ఎన్ని వేల సైన్యముతో ముట్టడివేసినను అది వశముకానట్టిది".

"అయితే ఏమాయె, నాకాకోటయే కావలెను. నీకీ మధ్య యెవ్వరో పిరికిమందు పోసినట్లున్నది."

"ఆకోటను రక్షించువాడు ఉదయభానుడను మహా యోధుడు. రాజపుత్రులు, అరబ్బువీరులు ఆకోటను ఏమరక కావలి కాయుచున్నారు. అయినను కొంతకాల మాగుడు. చుట్టుపట్టుల కోటలను క్రమముగా సాధించుచున్నానుకదా. అదియు సాధించితీరుదును.

"ఎన్నడో సాధించుట నాకు సరిపడదు. నాకిప్పుడే "సాధించి యీయవలెను.

శివాజీ దీర్ఘాలోచనా నిమగ్నుడై ఎట్టకేలకు తల్లికి మాటయిచ్చి ఆమెను తనవెంట రాయగడ్ కోటకు పిలుచు కొని పోయెను.

ఈ సాహసకార్యమును ఎవ్వరు నిర్వహింతురోకదా అని శివాజీఆలోచించుచుండగా "ఉమ్రాతే" సూబేదారును, మహాశూరుడును, తన సేనానాయకులలో పేరుగన్నవాడును అగు తానాజీ జ్ఞాపకమువచ్చెను. తత్క్షణమేరమ్మని ఆతనికి

జాబువ్రాసెను. తానాజీ తన కుమారుడగు "రాయిబా"కు వివాహము నిశ్చయించి పెండ్లి ఏర్పాటు సందడిలో మగ్నుడై యుండెను. ఛత్రపతి పంపినజాబుచూచినవెంటనే పెండ్లికార్యములన్నియు ఆపి, డాలుకత్తి తీసికొని, తన పినతండ్రియగు శేలారుతోను, తమ్ముడగు సూర్యాజీతోను, ౧౦౦౦ మంది మావళేలతోను తన యేలికసేనలో వచ్చిచేరెను. తాను శివాజీకన్న వృద్ధుడగుటచేతను, చనువు కలవాడగుటచేతను "ఏమయ్యా! కొడుకు పెండ్లికూడ చేయనియ్యవు. ఇంత తొందరపని యేమివచ్చి నెత్తి నపడినది" అని మందలించెను. "నాకేమి తెలియునోయ్. మన అమ్మగారిని విచారించుము" అని శివాజీ జవాబుచెప్పెను. జిజాబాయి సమయస్ఫూర్తి గలిగినట్టిది. తానాజీ ఆమె కాళ్లపై తన రుమాలనుబెట్టి "తల్లీ! నీకేమి కావలెనో సెలవిమ్మా. సాధించి తెచ్చి యిత్తును" అని పలుకగానే "నాయనా! నీవంత వాడవనేకదా పిలిపించితిని. నీవు మహావీరుడవు. నా శివాజీ తర్వాత నీవేనాకు పుత్రసమానుడవు. నీవు సాధించని కార్యముండునా" అని పలుకుచు, జ్యోతి నివెలగించి అతని మొగముపై మూడుమారులుత్రిప్పి "చిరంజీవుడవుకమ్ము" అని కడతలపై మెటికవిరిచి "బిడ్డా! నాకు సింహగడికోటను వెంటనే వశపరిచియియ్యవా? ఇదే నేనుకోరిన చిన్నకోరిక" అని తిన్నగా తెలిపెను.

శూరాగ్రేసరుడగు తానాజీ జంకుగొంకులేక రెండవ ఆలోచన లేవిచేయక "అదెంతపని, ఇప్పుడే బయలుదేరుదును. కోటపై రేపటివరకు మనధ్వజంబా ఎగురవేయుదును. జయసూచకముగా అయిదుతోపులు కాల్పింతును. మీకే

మియు సందేహమువలదు" అని పలికెను. శేలారు, సూర్యాజీలతోను తన ౧౦౦౦ మంది మావళేలతోను తానాజీమాల్ సురే సింహగడ్‌కు ప్రయాణమయ్యెను. కోటకొకటి రెండు క్రోసుల దూరముననే అడవులలో తన సేననుదాచియుంచి తానాజీ యొక్కడే కోటను సమీపించెను. కోటకు ఒక మైలు దూరములో అడవిజాతివారగు "కోలీ"లు అతనిని పట్టుకొనిరి. "ఓయీ! నేను సఖారాగ్రామము పటేలును. మీరెరుగరా! వేటకై రాగా పెద్దపులి తరుముటచే యిటు పారివచ్చితిని"అని వారికి నచ్చచెప్పి, చెలిమిచేసుకొని వారికి తమలపాకులు, వక్కలు, నల్లమందు పంచిపెట్టెను. కోలీలు సంతోషపడిరి. అటుపై వారికి ధనము, బంగారు జవాబుమతిగానిచ్చెను. వారు పూర్తిగా వశవర్తులైరి. అప్పుడు యథార్థమంతయు వారికి చెప్పి తనకు కోట మర్మమంతయుచెప్పిన కోట సాధించిన తర్వాత వారందరికిని మంచి మంచి ఇనాములు శివాజీ మహారాజుచే నిప్పింతుననెను. కోలీ లిట్లుచెప్పిరి:—

"కోటను ఉదయభానుడు ౧౮౦౦ రాజపుత్రులతోను, పఠానులతోను, అరబ్బులతోను కాపాడుచున్నాడు. ఉదయభానుడు మహాబలాఢ్యుడు. వాడు తిండిలో బకాసురుడే. పూటపూటకు వానికొక్కనికే ఒక మేకపోతు కావలెను. వానికి ౧౮ మంది భార్యలు. ౧౨ మంది కొడుకులు. వాని సేనాని సిద్దీహిలాల్, వాడు హిడింబునికి అన్ననో, తమ్ముడో అయినట్టివాడు. సిద్దీహిలాలునకు ౯ మంది పెండ్లాలు. కోటలో చంద్రావలి అను మనుష్యులచంపు ఏనుగున్నది. కోట నలుది

కుక్కల రాత్రింబగళ్ళు కావలి కాయుదురు. ఏదిక్కుచూచినను ఎక్కుటకు వీలులేదు. కాని తూర్పుదిక్కున నుండు కల్యాణీ ద్వార సమీపమందలి డోంగ్రీ గుట్టవద్ద ఏమైన మీరు సాహసించిన సాహసింపవచ్చును." తానాజీ నడిరేయిమీరినతర్వాత మెల్లగా తన తావునుండి సేనతో కదలి, కల్యాణీ ద్వారమువద్ద చేరి అచ్చట తన తమ్ముడగు సూర్యాజీని సైన్యముతో నుంచి నూరుమంది సాహసికులను మాత్రమే తీసికొని డోంగ్రే గుట్ట దిక్కునడిచెను. తనవెంట శివాజీ పెంచినట్టి "యశ్వంత్" అను ఉడుమును తీసికొని వెళ్ళియుండెను. ఈ యశ్వంత్ ఇదివరకే ౨౭ కోటల నెగబ్రాకి శివాజీకి గొప్పసేవ చేసియుండెను. తానాజీ యశ్వంతు నెత్తిపై టెంకాయకొట్టి కుంకుమబొట్టు పెట్టి పూజించెను. తర్వాత దాని నోటిపై తేనెపూసి నడుమున త్రాడుకట్టి కోటగోడపై విడిచెను. ఉడుములకు తేనె అనిన అమృతప్రాయము. దానివాసన తగిలిన అదిదారకు వరకు పర్వతములుగాని, మహా వృక్షములుగాని ఎగబ్రాకుచుండును. యశ్వంతు తేనెవాసనచే నేటుగా, నూటిగా ప్రాకుచు ప్రాకుచు కోటపైకివెళ్ళెను. తానాజీ మొట్టమొదట తనఖడ్గమును పండ్లతో బిగబట్టి త్రాడుబట్టుకొని పై కెగబ్రాకెను. తర్వాత అతని పినతండ్రియగు శేలారు ఎక్కెను. తర్వాత ౮౫ మంది వరకు భటులు ఎక్కిరి. అంతలో యశ్వంతు నడుమున కట్టినత్రాడు తెగిపోయెను, కోటపైన ౯౦ మందియే యుండిపోయిరి. శేలారు భయగ్రస్తుడై దుముకబోయెను. తానాజీ తనఖడ్గమును ఝళిపించి, కంఠము నెగురమీటుదునని భయపెట్టి ఆ ౯౦ మందితోనే కోటలో ప్రవేశించెను.

నిబిడాంధకారము. సిపాయీలు గాఢనిద్రలో నుండిరి. తానాజీ వారిని చప్పుడు సద్దుచేయక దీర్ఘ నిద్రలో ముంచి మొదటి ద్వారమువద్ద సిపాయీలను జంపి కల్యాణీద్వారము దిక్కు నడిచెను. ఇంతలో కోటయందు కోలాహలమయ్యెను. సిపాయీల నందరిని జాగ్రత్తులచేయుటకై నగారా దబదబ మ్రోయింపబడెను. సింహగడీవారు శత్రువులెట్లువచ్చిరో, యెందరువచ్చిరో ఏమూలలో ఏమైనదో అని భయగ్రస్తులై తమ ఏనుగును మొదట శత్రువులపై విడిచిరి. అది తానాజీ యుండు తావునకువచ్చి తొండముతో తానాజీ భటులను విసరి కొట్ట దొడగెను. తానాజీ ఒకేటే దెబ్బతో దానితొండమును నరికి, దానిపై కెగిరి మస్తకముపై ఖడ్గప్రహారములు చేయుచు చంపి కూల్చెను. సిద్దీహిలాలున కీసంగతి తెలిసి, తన ౯ గురు భార్యలను చంపి ఖడ్గహస్తుడై తానాజీపై బడెను. శత్రువులు కొలది మందియేయని గ్రహించి హిలాలిట్లుపలికెను. "అరే! వ్యర్థముగా ఎందుకు చావవచ్చితివి. పూరిగరచి చెప్పులు నెత్తిన బెట్టుకొని క్షమాపణగోరుకొనుము. లేకున్న నీపెద్దల నీకిప్పుడే చూపింతును" తానాజీ ప్రత్యుత్తరము కరవాలముచేతనే యిచ్చెను. సిద్దీతలపై బలముకొలది దెబ్బకొట్టగా తలనుండి కంఠమువరకు రెండుపాయలుగా చీలి వాడు క్రిందబడిచచ్చెను.

తానాజీభటులు కొందరు ఈ కోలాహలములో కల్యాణీద్వారమువద్దకిపోయి ద్వారపాలకులతో పోరి, వారినిజంపి ద్వారమును తెరచిరి. సూర్యాజీ తనసైన్యముతో భీకరధ్వనులు చేయుచు లోపలికిపడ దుమికెను. సారామత్తుచే తనభార్యలతో లీలావిలాసములందు ప్రొద్దుపుచ్చుచున్న ఉదయభానునికి

దుర్వార్తలన్నియు తెలిసెను. తన కుమారులను యుద్ధము చేయబంపెను. వారును చనిపోయిరి. తుదకు తనభార్యలనంద రను తనకత్తికి బలియిచ్చి స్వయముగా యుద్ధరంగములో జొరబడెను.

ఉదయభానుడు భయంకర స్వరూపుడు, నల్లనివాడును, క్రూరకర్మ-శకాయుడును నైయుండెను. తానాజీకూడ తక్కువ వాడుకాడు. ఇంచుమించు ౫౦ సంవత్సరములవాడు. తానాజీ ఆజానుబాహుడు, విశాలవక్షస్థలమును భయంకరశ్మశ్రువు లును కలవాడు. పెద్దతలపాగను ధరించినాడు. సాముచే కండ లుతిరిగిన యంగములు కలవాడు. ఖడ్గమును త్రిప్పుటలో మహా నిపుణుడు. ఉభయవీరులకును అరగంటకాలము తీవ్రము గాపోరు జరిగెను. అయినను తానాజీ ఆయుఃప్రమాణము పరి పూర్తి అయియుండెను. ఉదయభానుని ప్రహారములచే తానా జీ నిహతుడై ఏనుగవలె కూలిపడెను. తానాజీ పినతండ్రియగు శేలారు వెంటనే ఉదయభానునిపై బడి, వానిని పొడిచిచంపెను. మొగల్ నాయకులందరును హతులైరి. కోటలోనివారి కిక దిక్కెవ్వరును లేకపోయిరి. బయటి సైన్యము లోపలికి ప్రవే శించి ౧౦౦౦ మందికి పైగా హతమొనర్చెను. మిగిలిన వారును అన్ని దిక్కుల చెదరిపోయి యుండిరి. హతశేషులు శరణువేడి ప్రాణముల దక్కించుకొనిరి.

సూర్యాజీ ఢిల్లీద్వారము క్రిందికిలాగి చించి పారవైచి తమ కాషాయధ్వజమును ఎక్కించెను. అయిదుతోపులు కాల్పించెను. ఆనిశ్శబ్ద నిశీధమందు ఆ విజయధ్వానములు రాయగడలో ప్రతిధ్వనించి విజయఢంకా మ్రోగించెను. సింహా

గడ్ కోట శిఖరముపై బండ్లకొలది కట్టెలగాల్చి నెగళ్ళు వేసి రాయగడ్‌కు నిస్తంత్రీవార్త తెలిపిరి. తెల్లవారువరకు ఛత్రపతి శివాజీ మహారాజు సింహగడీనిచేరెను. సూర్యాజీ, సేలారు మున్నగు వారందరును అతనిని ఎదుర్కొని జయజయ ధ్వానములతో ఆహ్వానించిరి. కాని తనకు ప్రాణతుల్యుడైన, తన తల్లిచే తనకు సోదరుడుగా నిర్ణయింపబడిన తానాజీమాత్రము ఎదురుకొనలేదు. ఆశూరాగ్రేసరుడు తప్పక కోటకు బలి యయ్యెనని గ్రహించెను. ఆనందమంతయు విషాదముగా మారెను. ధీరోదాత్తనాయకుడు గాన ప్రశాంతముగా కోట నెక్కుచు పోయెను. కోటయంతయు తానాజీ కొరకై వెదకుచు నలుదిక్కులచూచుచు తిరిగెను. తానాజీ శవమును చూచినవెంటనే ఆశవమునద్దగ్గరకు వచ్చి, అట్టే ఆతనినిచూచుచు కన్నీరు కార్చెను. శవమును కౌగలించుకొనెను. ఎవరోయొకరు "మహారాజా! ఏలదుఃఖించెదరు గెంటండితోనే ఎవరునుసాధించనట్టి ఈ సింహగడీకోట మాల మీావశమయ్యెను కదా" అనిహెచ్చరించిరి. శివాజీదుర్భరవిషాదముతోనిట్లు పలికెను.

"గడ్ ఆలా

పణ్

సింహా గేలా"

గడీ వచ్చెను.

కాని

సింహము చచ్చెను."

# అబ్దుర్ రజ్జాఖ్



క్రీ. శ. ౧౬౮౭ లో గోలకొండ సుల్తాను యొక్క సేనానియగు ఇబ్రాహీంఖాను ద్రోహియై మొగల్ సేనలో చేరినందున అబుల్ హసన్ తానాషా నిరుత్సాహియై ఔరంగజేబు కుమారుడగు షాహాలంకు లోబడెను. ౧ కోటి ౨౦ లక్షల రూపాయీల నష్టపరిహార మిచ్చుకొనెను. మల్ఖేడు మున్నగు జిల్లాలను వదలుకొనెను. వెండిసంకెళ్లతో షాహాలం యువరాజునెదుట దీనుడై నిలిచి క్షమాపణ వేడుకొనెను. అక్కన్న, మాదన్నల తలలు కూడ కానుకలుగా సమర్పించుకొనబడెను. కాని ఔరంగజేబు చక్రవర్తికి తృప్తి కలుగకపోయెను. తానే స్వయముగా ప్రబలసైన్యముతో ఏదో మిష కల్పించికొని గోలకొండను ముట్టడించెను. తన కప్పము చెల్లించలేదని తొందరపెట్టెను. అబుల్ హసన్ ప్రజలనుండి దమ్మిడీ దమ్మిడీలాగి తాను ధరించు నగలను, బేగముల సొమ్ములన్నింటిని ఊడ్చి ఆలంగీరునకు పంపెను. అప్పటికిని లాభము లేకపోయెను. అబుల్ హసన్ కోటబంధించికొని లోపలకూర్చునెను. అత్యంత విశ్వాసపాత్రుడైన అబ్దుర్ రజ్జాఖ్ సేనానియయ్యెను. ముట్టడి

నెలలపర్యంతము జరిగెను. కోటచుట్టునుండు అగడ్తను పూడ్చు టలో వేలకొలది మొగల్ సేన హతమయ్యెను. ఒకచోట మూడు సురంగములుచేసి తుపాకిమందునింపి అంటించిరి. ఆ మందు వెనుకకుతిరిగి మొగలు సైన్యమునే చంపెను. అబ్దుర్ రజ్జాఖిదివరకే దానిని గుర్తించి కోటలోపలినుండి సురంగము లుచేసి ఆ మందువరకు నీరునింపియుండెను.

ఆలంగీరు అగడ్త నింపుచుండెను. వర్షములు వచ్చి అంతయు కొట్టుకొనిపోయెను. మరల ప్రారంభించెను. అబ్దుర్ రజ్జాఖ్ సమయముకనిపెట్టి తటాలున కొంత సేనతో మొగలుల పై బడి నాశనము చేసిపోవుచుండెను. వీడే మహాప్రబలుడని ఆలంగీరు గ్రహించి అబ్దుర్ రజ్జాఖునకు స్వహస్తాక్షరితో జాబు పంపెను. తనకు సహాయము చేసినట్లైన రజ్జాఖునకు ఉన్నతో ద్యోగము నిత్తుననెను. రజ్జాఖ్ తనసైన్యమంతయు నొకచో చేర్చి ఆలంగీరులేఖను చదివి వినిపించి ప్రత్యుత్తరముగా దానిని చించి గాలికి విడిచెను.

ఆలంగీరు సేనానియగు ఫీరోజుజంగొక నాటిరాత్రి కొం దరితో కోటగోడలకు నిచ్చెనలువేసి యెగబ్రాకెను. కొందరు కోటగోడలకు చేరిరి. తక్కినవారు నిచ్చెనలపై నెక్కుచుండిరి. అప్పుడు కోటలోని యొక కుక్క వారినిచూచి, "భౌ, భౌ" రావములలో కోటలోనివారిని మేల్కొలిపెను. శత్రువులు కం దకము లోనికి కందుకములవలె విసిరి పారవేయబడిరి. అబుల్ హాసన్ ఆకుక్కకు బంగారు మెడపట్టీ బంగారుగొలుసు చేయిం చెను. జర్రీ కుడుతా తొడిగించెను. పైగా దానినొక సర్దారుని గా చేసి తనవెంటనే నుంచుటకై ఆజ్ఞయిచ్చెను. ద్రోహియగు

ఇబ్రహింఖాను సేనానికి కుక్క విశ్వాసములో శతాంశమైనను లేకపోయెను! భారత దేశములో కుక్కలుకన్న నీచాతినీచులగు దేశద్రోహులు చరిత్రలో అడుగడుగునకు తటస్థించుచుందురు.

మరల ఆలంగీరు రజ్జాఖ్‌తో రహస్యపత్ర వ్యవహారములు నడిపెను. కాని ఆవీరుడు తాను తుదివరకును కర్బలాలో పైగంబరు మనుమలకై ప్రాణములిచ్చిన వారివలె పోరాడితీరుదునని జవాబిచ్చెను.

పరిస్థితులిట్లుండ ౨౧ సెప్టెంబర్ ౧౬౮౭ నాఁటిరాత్రి అబ్దుల్లాఖాన్ అనునీచుడు అబుల్‌హాసనుకు ద్రోహియై ఔరంగజేబు లంచములకు గురియై తాను కావలియున్న దిడ్డివాకిలిని తెరచి శత్రుసైన్యమును లోపలికి వదిలెను. అబ్దుర్ రజ్జాక్ ఈ వార్త వినినవెంటనే పండ్రెండుమందిని మాత్రమే వెంటతీసికొని శత్రువులపై బడెను. ఒకవేయిమందిలో ఎదుటపడినవారిని తునుముచు బాటచేసుకొని పోవుచుండెను. పైభాగమునకుపోయి సైన్యములకూర్చికొని ద్వారములను బంధింప గోరుచుండెను. కాని ఒక్కడు వేయిమందిపై ఏమిచేయగలడు. శరీరమున ౭౦ గాయములు తగిలెను. ఇంకను లోబడకుండెను. తుదకు స్మృతి తప్పి గుఱ్ఱమునుండి గిరువక్రింద పడిపోయెను. ఆలంగీరుకోటను వశపరుచుకొనెను. అబుల్‌హాసన్ తనకాలము సమీపించెనని గుర్తించి జనానాలోనికిపోయి భార్యలందరను కౌగిలించుకొని తన తప్పులన్నియు క్షమింపుమని వేడికొని ప్రశాంతముగా తన సింహాసనముపై కూర్చుని శత్రువుల నెదుర్కొనుటకై నిరీక్షించుచుండెను. శత్రువులు వచ్చుటలో ఆలస్యము చేసినందున తన భోజనముకూడ తెప్పించుకొని సింహాసనముపైననే భుజించెను.

కొన్ని ఘడియలలోనే అతడు ఖైదీయయ్యెను.

అబ్దుల్‌రజ్జాఖ్ రెండుదినాలవరకు పడినచోటనే స్మృతి తప్పియుండెను. అతనిని తర్వాత గుర్తించి రహుల్లాఖాన్ అను నతడు తనయింటికి తీసికొనిపోయి చికిత్స చేయించెను. కొంత కాలమునకు గాయములన్నియు మానిపోయెను.

బహుకాలము వరకు ఔరంగాజేబు అతనిని గౌరవించుచు తన సేనానాయకత్వము వహించుటకై పలుమారు ప్రార్థించెను.

ఇతరసర్దారులును ప్రోద్బలముచేసిరి. తుదకు ఎంతయో. నిర్బంధముపై ఆలంగీరుసేవ నంగీకరించెను.

ద్రోహముచేసి గోలకొండ రాజ్యనాశనము నకు కారకుడైన అబ్దుల్లాఖానుకు ప్రతిఫలముగా ఆలంగీరు వానితల నరకించెను.



# అభయచందు—నిర్భయచందు.





200 సంవత్సరముల క్రిందట నాసిరుద్దీ అను పాదుషా ఢిల్లీరాజ్యము చేయుచుండెను. అతని కాలములోనుండు "అర్గళ" అను ఒక చిన్న సంస్థానమును పాలించు గౌతముడను రాజు పాదుషాకు కప్పముకట్టుటకు నిరాకరించి తిరుగబడెను. అర్గళరాజుకు బుద్ధిచెప్పుటకు ఔధ్ సూబేదారును గొప్ప సైన్యముతో యుద్ధమునకు పంపెను. కాని అర్గళరాజు విజృంభించి సూబేదారు సైన్యములో ౧౦౦౦౦ సైనికులనుచంపి సూబేదారును పారగొట్టెను.

ఇట్లుండ ఒకనాడు పూర్ణిమా పర్వమగుటచే ఆచారప్రకారము అర్గళరాణికి గంగాస్నాన మవసరమనిపించెను. కాని గంగాతీరము ఔధ్ సూబేదారు వశములోనుండెను. రాజుగారికి సంగతిచెప్పిన అంగీకరించరని అతనికి తెలుపకయే రాణిగారు కొందరి పరిచారకులతో రాత్రియంతయు నడిచి తెల్లవార గంగాభవానిని దర్శించుకొని అందు స్నానము చేయుచుండెను.

రాణి అందరిస్త్రీలవలెలేదు. వజ్రాలనగలధరించి విలువగల బట్టలు కట్టియుండెను. సంకల్పముచెప్ప బ్రాహ్మణులకు

భూరిదానము లిచ్చెను. పరిచారికల నందడి, యీపటాటోప మంతయును జోధ్ చారులకు వింతగాతోచెను. తమ చాక చక్యము నంతయు వినియోగించి ఆమె అర్గళ రాణి యను సంగతిని గుర్తించిరి. సూబేదారీవార్తను దృవపరచు కొను టకై తమ కూతుండ్ర నిద్దరను పంపించెను. వారారాణితో ముచ్చట్లు పెట్టుచు మెల్లమెల్లగా రహస్యమునులాగికొని ఆమె అర్గళ రాణియేయని తమతండ్రికెరిగించిరి.

తన పరాభవమునకు ప్రతీకారముచేయ మంచి అవకా శము దొరకెకదాయని సూబేదారు హర్షించి ఆమెనుబంధించి యెత్తుకొనిపోవుటకై స్వయముగా కొందరి భటులను వెంట తీసుకొని అర్గళరాణి స్నానముచేసి పూజలు ముగించుకొని తన రాజధానికి వెళ్ళుటకై సిద్ధమగుచుండగా ఆమెను ముట్టడిం చెను.

ఆనాటి రాజపుత్రస్త్రీలకును ఈనాటి మార్వాడీ స్త్రీ లకును హస్తి మశకాంతర న్యాయము. ఆనాటిస్త్రీలు వీరాంగ నలు, ఈనాటివారు పిరికిపందలు. ఆనాటిస్త్రీలు సాముచేసిన కర్కశ శరీరలు, ఈనాటివారు తిండిసాముచే కాగులవలె పెం చుకొనిన పొట్టలుగలవారు. ఆనాటివారు శక్తిస్వరూపిణులు, ఈనాటివారు రక్షాపేక్షితలు.

అర్గళరాణి తనచుట్టు భయంకర పఠానులు కత్తులు ఝుళిపించుచు భయపెట్టుచుండినను కించిత్తుకూడ చలించక ఇట్లు పలికెను. "పిరికి పందలైన మీకుసిగ్గైన లేదుకదా! మగ వారితో పోరాడలేక పారివచ్చి ఆడువారిపై అందును, నిస్సహా

యలును, నిరాయుధులును నగువారిపై దర్పముచూప వచ్చిన మీరాముఖములపై ఉమ్మివేయువారులేరా!" సూబేదారుని కీ మాటలు తేనెతెట్టనుండి జోపబడిన తేనెటీగలు కుట్టినట్లుగా శరీరమంతయు మంటలెత్తించెను. సిగ్గుపడుటకు మారుగా క్రుద్ధుడయ్యెను. "దీనినిపట్టుడు! పట్టుడు!" అనిభటుల కాజ్ఞయిచ్చెను. భటులు చకితులై ఆందోళన పడుచుండగా రాణి మరల యిట్లు పలికెను. "నేను రాజపుత్రస్త్రీని. బొందిలో ప్రాణమున్నంత వరకు ఓటమిఎరుగనట్టి జాతికి చేరినదానను. యేమీ! ఇచ్చట రాజపుత్రమాతను, రాజపుత్రసోదరీమణులను గౌరవించు సోదరులెవ్వరైన కలరాలేరా?" ఈమాట లావీర నారీమణి నోటి నుండి వెడలెనో లేదో, ఈసంవాదమునంతయు వెనుకనుండి పరీక్షించుచుండిన అభయచందు, నిర్భయచందు అను సోదరులు తటాలున చుట్టుమూగియున్న గుంపును చీల్చుకొని ఒర నుండి కత్తులులాగి పఠానులపై పడిరి. వారిద్దరు పఠానులతో యుద్ధము చేయుచుండగా వారి పరిచారకు డొకడు గుఱ్ఱముపై ప్రచండ వేగముతో స్వారియగుచు అర్గళరాజుకీవార్త తెలుపుటకుపోయెను. ఈ యిరువురును తమ యనుచరుల సహాయముతో ఘోరముగా పోరుచుండిరి. కొంతసేపటికి వీరి యనుచరులలో కొందరును, నిర్భయచందును చనిపోయిరి. అభయచందున్ను, ముగ్గురునల్గురు అనుచరులును మిగిలియుండిరి. పఠానులు విజృంభించి వారిపైబడి ఇక కొన్ని క్షణములలో రాణి తమవశమగునని యుల్లాస పడుచుండిరి.

అట్టిసమయమున అర్గళరాజు స్వయముగా కొంతసిబ్బందితో రణభేరి మ్రోయించుచు పఠానులపైబడెను. పఠానులు దిగ్భ్రాంతులై పారిపోయిరి. రాణీతో సహా, అభయచందుతో సహా అర్గళమునకు రాజుమరలెను. అభయచందుకులములో తక్కువవాడైనను కృతజ్ఞతా సూచకముగా రాజుతన బిడ్డనిచ్చి పెండ్లిచేసి "రావు" బిరుదమునిచ్చి తనరాజ్యములో కొంతభాగము జాగీరుగానిచ్చి గౌరవించెను.

నాసిరుద్దీను పాదుషాకు సూబేదారు చర్యలు తెలిసిన తర్వాత వాని నగౌరవపరచి నౌకరీనుండి తొలగించెను. పెద్ద చిన్నలందరిలో సూబేదారు నైచ్యమును ఖండించని వారు లేకుండిరి.



# గురుగోవిందు.

"సవయ్యా లాఖ్ పర్ చఢావే
జబ్ గురుగోవింద్ కె నాము సునావే"



గురుగోవిందుని కనుసన్నపైననే నవాలక్ష సైన్యము యుద్ధభూములో పడదుముకెడిది. గురుగోవిందుని నామమే శిక్కులకు పంచాక్షరీ మంత్రరాజము. గురుగోవిందుడే శిక్కులకు దశమావతారము. గురుపీఠములు కొంతకాలమైనతర్వాత అదర్శములనుండి పడిపోవుట చారిత్రకముగ కనుగొని కాబోలు తనతర్వాత గురువులుండకుండుటకై నిషేధించి "గురుగ్రంథ సాహెబు" గురుస్థానము వహించునని ఈతుదిగురువు శాసించిపోయెను.

మొదటమొదట శిక్కుమతము ఒక సంస్కారమతముగా హిందూ-ముసల్మానులు ఐక్యతకై ఏర్పడియుండెను. అహింసాప్రాధాన్యత కలదిగా నుండినందున శిక్కులకు ఆదిలో మాంసాహారము నిషిద్ధమైయుండెను.

కాని శిక్కులవెంబడిపడి మొగలుపాదుషాలు చాల ఘోరదురంతములను చేసిరి. ఐదవ గురువగు గురు అర్జును జహాంగీరు చక్రవర్తి చంపించెను. అతని కుమారుడగు గురు హరగోవిందుని కారాగారములో ౧౨ సంవత్సరములు ఘోరముగా పీడించి బంధించి యుంచెను.

గురుహరగోవిందు ముక్తుడైనవెంటనే శిక్కులను యోధసంఘముగా (Militray Class) మార్చివేసెను. యుద్ధమందు సాహసికులౌటకై మాంసాహారములు విధిగా శిక్కులందరికిని విధించెను.

ఔరంగజేబు చక్రవర్తి పరమత హింసలో సంపూర్ణ పరిణతి బొందిన మతావేశపూరితుడు. అతడుహిందువులనేకాక శిక్కులనుకూడ నానావిధముల బాధించెను.

ఈ ఆలంగీరుపాదుషా అనేక శిక్కులను చంపించెను. మతముమార్పించెను. తొమ్మిదవ గురువగు గురుతేగ్ బహాదరదిచూచి చాలావిచారపడెను.

ఒకనాడు కొందరు బ్రాహ్మణులు తమకష్టములను విన్నవించుకొని గురువుగారిని తన్నివారణార్థమై ఏదైన యుపాయమాలోచించుమని వేడిరి.

"ఇప్పుడొక మహాత్ముని బలిదాన మవసరము" అని గురువువారు సెలవిచ్చిరి. అతని కుమారుడగు గురుగోవిందుడు "మీకన్న మించిన మహాత్ములెవరు" అని పలికెను. కుమారుని మాటలను మెచ్చుకొని వెంటనే గురుతేగ్ బహాదర్ ఢిల్లీకి ప్రయాణమై చక్రవర్తితో నిట్లనెను. "చిల్లరమూకలనుబట్టి వారి మతమును బలవంతముగా మార్చుట గొప్పపనికాదు. నా మతమును మీమతోత్కృష్టతచే మార్చినచో శిక్కులందరును రేపే తురుకలుకాగలరు"

ఖాజీలెన్ని ప్రయత్నములు చేసినను నిష్ఫలమయ్యెను. తుదకు ఔరంగజేబిట్లనెను "నీవు మహాత్ముడవేని నీమహాత్మ

ముచే నీతల తెగకుండునట్లు కాచుకొనుము." సరే అని గురు
వుగారొప్పుకొని తనకంఠమందొక కాగితమును తాయెతుగా
నుంచి కట్టుకొని శిరచ్ఛేదకుని యెదుట నిలబడెను. పాదుషా
సూచనచే గురువుగారితల తెగనరుకబడెను. కంఠమందలి తా
యెత యెగిరిపడెను. అందలికాగితములో నిట్లు గురువుగారు
వ్రాసియుండిరి.

"శిర్ దియా శీర్ నదియా"
"తలయిచ్చితినే
కాని
మతమియ్యలేదు"

చక్రవర్తి గురువుగారితో నుండిన భాయిమణిదాను
అనుశిష్యుని నెత్తిపై రంపముపెట్టి సగబాలుగా కోయించెను.
మరియు భాయిదయాలు అను వారిని సలసల క్రాగుచున్న
నూనె కుండములో వేయించి చంపివేచెను.

పదవగురువును, తుదిగురువునుఅగు గురుగోవిందుసింగు
ప్రచండుడయ్యెను. అనేక దుర్గములనుకట్టి తన ప్రాబల్యమును
పంజాబులో చాలాదూరము వ్యాపింపజేసెను. ఔరంగజేబు
గొప్పగొప్ప సైన్యములను పలుమారు గురుగోవిందుపై పంపి
నను మొగలుసైన్యమేతడవతడవకు ఓడిపోవుచుండెను. తుదకు
గురువుగారిపైనవహారుఖాన్ సేనానివెంట చాలగొప్పసైన్యమును
క్రీ శ.౧౭౦౧లో చక్రవర్తి పంపించెను. ఈ సైన్యముయొక్క దాడికు

తాళజాలక గురుగోవిందుడు ఆనందపూరు దుర్గములో నిలిచి పోయెను. గాని దానిసప్పుడే మొగలులు ముట్టడించిరి. గురువు గారి తల్లియు జోరావర్ సింగు ఫతేసింగ్ అను గురుగారి చిన్ని కుమారులతో కోటనుండి తప్పించుకొని సర్ హిందుకు పోవు చుండగా మొగలులచే పట్టుకొనబడెను.

సర్ హింద్ సూబాకు సూబేదారైన వజీరుఖాన్ అను వానికిని ఈబాలురకును నిట్లు సంభాషణము జరిగెను.
"మిమ్ములను వదలిపెట్టిన ఏమిచేయుదురు.
"ఏమిచేయుదుమా నీతోనే యుద్ధముచేయుదుము."
"మీరు ఓడిపోయినట్లైతే"
"మరల సైన్యమును సమకూర్చుకొని నీపై వత్తుము"
సూబేదారు ఈమాటలువిని అదరిపడి కోపఘూర్ణితుడై "ఉలెమా"లతో ఆలోచించి, "ఓరీ మీరు మా ఇస్లామును స్వీకరించి పవిత్రులుకండు లేకున్న మీగతి చాల ఘోరముగా పరిణమించును" అని పలికెను. బాలురు నిర్భయముగా, గంభీరముగా నిరాకరించిరి. ఒకగోడలో వీరిని నిలిపి రాళ్లు పేర్చుచు పోయిరి. కంఠము వరకు పూడ్చిరి. "ఇప్పుడైనను మీప్రాణములను రక్షించుకొనుటకై మామతమును స్వీకరించుడు" అని సూబేదారు హెచ్చరించెను.

"లేదు లేదు. ముమ్మాటికి స్వీకరించుటలేదు" అని ఏక వాక్యముగా ఆవీరబాలురిరువురును పలికిరి. గోడపూర్తిగా

కట్టించి వారికి సమాధికల్పించిరి. అచ్చట గురుగోవిందుసింగు ఆనందపురమునుండి తప్పించుకొని "మఖోవాల్" అనుకోటలో చేరికొనెను. అచ్చటికిని మొగలుసేనలువచ్చి చుట్టుకొనెను. కోటలో భోజన సామగ్రి క్రమక్రమముగా ముగిసిపోయెను. ఒకనాటిరాత్రి నిశ్శబ్దముగా గురువుగారును, ౪౦మంది అనుచరులునుకోటనుండి తిన్నగాజారుకొని "చాంకౌరు"కోటదిక్కు నడిచిరి. కానివారిజాడలు మొగలులు పసిబట్టి వెన్నాడి చుట్టుముట్టిరి. చాంకౌరుకోట సమీపములోనే అతిభయంకర యుద్ధము జరిగెను. వీరు ౪౦మంది మాత్రమే. శత్రువులా వందలకొలది. గురుగోవిందుగారి వెంబడి వారిమరి యిద్దరుకుమారులు అజిత్ సింగు, జుజ్జూర్‌సింగు అనువారుయుండిరి. తుదివరకును యుద్ధముచేయుచు అనేక శత్రువుల తునుమాడి పలుగాయములచే తంత్రడిచూచుచుండగనే వీరమరణమొందిరి. మొగలులు బొబ్బలిడుచు తమపైబడగా మొగల్ సేనాని యగు నహార్‌ఖాను శిరమును ఒక్కటే వ్రేటుతో గురుగోవిందునరకివైచెను. రెండవసేనానియగు ఖాజామహమ్మదును తీవ్రముగా గాయపరిచెను.

ఇప్పటికి గురుగోవిందువెంట నుండినవారిలో అయిదుగురే మిగిలినవారైరి. తమసేనానుల యవస్థనుచూచి దిగ్భ్రమచెందిన మొగలులనుండి దులుపుకొని యీ అయిదుగురును చండవేగముతో "చాంకౌరు" కోటలో చేరుకొనిరి. మొగలు

సైన్యములన్నియు వచ్చి ఆకోటనుగూడ ముట్టడించెను. కాని అచ్చటినుండి గురుగోవిందుడును, మిగిలినఅయిదుగురును మారు వేషములు వేసుకొని తప్పించుకొనిపోయిరి. ఇట్లెంకను బహుకష్టములకులోనై గురువుగారు "ముక్తేశ్వరమును" చేరి తన రాకను శిక్కులకు బంపిరి. కొలది దినములలో ౧౦౦౦౦ మంది శిక్కు యోధులు గురువుగారిచరణ సేవలో వచ్చి చేరిరి. సర్‌హింద్ సూబేదారు ఇతని యుద్ధప్రయత్నముల యాథార్థ్యము విని ప్రబలసైన్యముతో వచ్చి తాకెను. ఈయుద్ధములో మొగలులు సంపూర్ణముగాపరాజయ మొందిరి. తమ మతరక్షణార్థము గురువుగారు ఆయుద్ధస్థలములో నొక గొప్పచెరువును నిర్మింపజేసి దానికి "ముక్తేశ్వరము" అని నామకరణము చేసిరి.

ఈయుద్ధానంతరము మొగలులు శిక్కులజోలికి పోవుటయే మానుకొనిరి.



# బలభద్రుడు.





ఈపూజ్య వీరాగ్రేసరుని దివ్యచరిత్ర ౧౨౦ఏండ్లక్రిందటిది. రంగము నేపాళదేశము. శత్రువులు శతగ్నికాయుక్తులును, దేశీయ ద్రోహిరాజ సహాయయుక్తులును, అపార సైన్యద్రవ్యలక్ష్మీకటాక్షలాలితులును అగు—బ్రిటిషువారు.

హేస్టింగ్సు గవర్నరుజనరలు క్రీ. శ. ౧౮౧౩ఆఖరులో హిందుస్థానమునకు దయచేసెను. వచ్చుటతోడనే నేపాళరాజ్యముపై దృష్టిసారించెను. ఏదోవిధముగా నేపాళమహారాజుతో తగవులు కల్పించుకొని యుద్ధప్రకటనముచేసెను. నూతన మారణ యంత్రయుక్తమగు ౩౦,౦౦౦ సైన్యమును ౬౦ తోపులును పంపెను. నేపాళమువారివద్ద ౧౨౦౦౦ సైన్యమేయుండెను. తోపులులేవు. యుద్ధసామగ్రికూడ సరిగాలేదు. దేశమంతయు పర్వతప్రాంతము సరియగు బాటలులేవు. కొండరాళ్ళే ముఖ్యమగు ఆయుధములు. అయినను అవేవారిని రక్షించినవి.

గిల్లెస్పీ సేనాని గొప్పసైన్యముతో డేరాడూనునుండి నేపాళముప్రవేశించెను. సరిహద్దులోనే బలభద్రుడు అనునేపాళ సేనా

ని ౬౦౦ గూర్ఖాలతో మాత్రమే స్వదేశ సంరక్షణము చేయు టకు సంసిద్ధుడయ్యెను. ఈగొప్ప ఇంగ్లీషు సైన్యముతో పోరా డుట కష్టమని తన "కలంగా" కోటలో నిలిచిపోయెను. బ్రిటిషు సేనాని అతనికిట్లు వార్త పంపెను. "తక్షణమే మాకు లోబడు ము. లేకున్న నీకు సర్వనాశనమే ప్రాప్తించును." బలభద్రుడు తనజన్మములో ఓటమి యెరిగినవాడు కాడు. పిరికితనము ఒక వెంట్రుకలోనైన కానరాదు. మృత్యువునకు వెరచు స్వభావము ఎన్నడునులేనట్టివాడు. అట్టివానివలన ఏమి ప్రత్యుత్తరము దొరుకును?

"యుద్ధరంగములోనే నీకు సరియగు సమాధానము దొరుకగలదు."

అని సూత్రప్రాయముగా ప్రతివార్త నంపెను. బ్రిటిషు వారికి అతని బిరుసుదనముపై కోప మినుమడించెను. కోటను నాలుగుదిక్కుల ముట్టడించిరి. ఫిరంగులు ఘోరముగా ప్రయో గింపబడెను. కోటగోడలు కూలిపడ జొచ్చెను. కోటలోనివారు కొందరుచచ్చిరి. ౬౦౦ నుంది ౨౦౦ మంది అయిరి. అయినను బలభద్రుడు క్షణక్షణమున వీరభద్రుడగుచువచ్చెను.

గిల్లెస్పి సేనానికి వీరిపట్టుదలపై ఆగ్రహము కలిగెను. కో టగోడల నెగబ్రాకుటకై సైన్యమును ప్రోత్సహించెను. ఈప్ర

యత్నములో కోటనుండి వెడలిన ఒక తుపాకీగుండు గిల్లిస్పి ఎదనుచీల్చుకొని వీపున వెడలివచ్చెను. వెంటనే అతడు గిజగిజ తన్నుకొని చచ్చిపడెను. "కర్నల్ మాబే" సేనానియయ్యెను. మరింతతీవ్రముగా ముట్టడిసాగించెను. గూర్ఖాలలో స్త్రీలుకూడ నుండిరి. వారు శక్తిరూపిణులై కొండగుండ్లను బ్రిటిషుసేనపై దొర్లించుచు, బ్రిటిషువారి తుపాకీగుండ్లకు గురియై సూర్యమండలము భేదించుకొని పోవుచుండిరి. "మాబే" దొరకు విస్మయమయ్యెను. నెలదినములైనను కోట వశము కాకపోయెను. సుమారు ౧౦౦౦ సైనికులు హతమైరి. కోటను సమీపించుట యముని చేరుకొనుటయే! "ఈయున్నతమైన కోటలో త్రాగుటకై నీళ్ళెక్కడివి?" అను నాలోచన బ్రిటిషు సేనానికి స్ఫురించెను. వెంటనే "నాలాపానీ" అను కొండకాలువనుండియే కోటలోనివారికి నీరు దొరుకుచుండినట్లు కనుగొనబడెను. ఆ కాలువకు అడ్డముగా కట్టకట్టి నీటినాపివైచిరి. బలభద్రుని సైన్యమునకు భోజన పదార్థములు మొదలే తక్కువైయుండెను. ఇప్పుడు నీరుకూడ బొత్తిగా లేకపోయెను. ౬౦౦ మందిలో ఇప్పుడు ౭౦ మంది మాత్రమే మిగిలియుండిరి. అప్పుడును బలభద్రుడు శత్రుశరణు జొచ్చుట నిరాకరించెను. తుదకు ఒకనాడు బ్రిటిషువారు తోపులతో కాల్చికాల్చి కొన్ని నిమిషాలకై విరమించియుండిరి. ఆక్షణములో వారికంటికొక యపూర్వదృశ్య మగు

పడెను. తటాలున కోటయొక్క లోహద్వారములను తెరచి వైచి బలభద్రుడు తనమిగిలిన ౯౦ మంది భటులతో ఒకహస్తమందు కృపాణము, ఒకహస్తమందు తుపాకి, తలపాగలలో చక్రమున్ను ధరించి, "హరహరమహాదేవ్" అని భీకరముగా గర్జించి మెరుపు మెరసినట్లు బ్రిటిషుసైన్యము కన్నులకు మిరుమిట్లు గొలుపుచు వారిపైబడి, సైన్యదళముల చీల్చి, చెండి, చంపి, చెదరగొట్టుచు ఒక్కరుకూడ చావకుండగా శత్రుసైన్యమును ఒకదిక్కునుండి యింకొకదిక్కువరకు భేదించుకొనుచు అవతలికిపోయి అందరుచూచుచుండగనే పవిత్ర "నాలాపానీ" ఝరిలో తమయొంటిన కంఠములను తడుపుకొనుచు కడుపార త్రాగి ఖడ్గములు లీలావిలాసముగా త్రిప్పుచు దాటుకొని వెళ్ళిరి.

ఇంగ్లీషువారు అయినదేమో అయినదని కోటను గాంభీర్యముతో ప్రవేశించి పట్టుకొనిరి. కోటలో వారికి స్త్రీల శవములు, గాయములతో చచ్చిన వీరులశవములు లభించినవి. కోటను నేలమట్టము చేయుటలో తమ కసినంతయు తీర్చుకొనిరి.

నేటికిని డేరాడూను సమీపమందలి నిశ్శబ్దారణ్యముల లో, "రిచ్ పనా" నదీతీరమున "మాయొక్క వీరశత్రువగు బలభద్రసింహుని జ్ఞాపకార్థము" అని చిన్న చిహ్నము ఇంగ్లీషుప్రభుత్వముచేత నిర్మింపబడినది. కాననగును.

"ధర్మపోలీ"లో లియొనిడాసు జగద్విఖ్యాతిపొందెను. అతనిని మించిన బలభద్రుని ఎవ్వరును ఎరుగరు." అని మోతీ లాల్ ఘోషుగారు ౩౦ ఏండ్లక్రిందట వ్రాసిన వాక్యములు ఇప్పుడుకూడ సత్యమే! విద్యావంతులలోనైనను ఇండియనులెందరు ఈ అభినవభీముని ఎరుగుదురు? ఏహిందూదేశ చరిత్రలోనైన విద్యార్థులకీకథ యెవ్వరైన వ్రాసి చదివించిరా? తుదకు హిందువులలోనైన ఎందరెరుగుదురీ హిందూ వీరాతివీరుని దివ్య చరిత్రము?



# సోమనాద్రి.



ప్రతిభ కృష్ణా తుంగభద్రాదిక్ష్మా
మండలిని బ్రోచె సామ్రాజ్యమహిమ
కందనూలుముఖ్య దుర్గముల దేశములెల్ల
దేశముఖ్యైక ప్రతిష్ఠనేల
గురుభూసురాదుల కురుభూమి రాజ్యాదు
లొసగెను ప్రీతి విధ్యుక్తరీతి
యవన ముఖ్యమహీశ నివహంబుల జయించి
కప్పముల్ గొనియె విక్రమనిరూఢి

గీ. ఆత్మరాజ్యంబు "కేశవా" యత్తముగను
జేసి హరిగృహ మార్జన సేచనాది
నిఖిల కైంకర్యములను తానె ఘటించె
ఔర! పెదసోమవిభుడు ప్రహ్లాదనిభుడు!

—కణాదముపెద్దన
అధ్యాత్మరామాయణము.

"అవిజ", "దరూరు" లకాదిగా దేశాయి
నాడగాడ మహోన్నతి దనర్చి
మించివైరులను భంజించి "కందనవోలు"
"బనగానపల్లె" "హోబలము" పరికట

బడెను. కొంతకాలము ధైర్యముతో పోరాడి బసరుజంగు సై
న్యము ధైర్యము కోలుపోయి వెనుదీయజొచ్చెను. సిపాయీల
చంచలనము చూచి బసర్ జంగు రాయచూరు దిక్కు తిరిగి చం
డవేగముతో పారిపోయెను. ఇంకొకప్రక్క ప్రాగుటూరు
నవాబు బుద్ధిదెచ్చుకొని యెప్పుడో పలాయనమొనర్చెను. ఇక
మిగిలినది సయ్యద్ దావూద్ మియా మాత్రమే. అతడును
తన ఉప్పెడుమార్గమును పట్టెను. సయ్యదు గజముపై స్వారి
చేయుచుండెను. సోమనాద్రి తన గుఱ్ఱమును దానిపైకి ఱికొ
ల్పెను. సయ్యదు భీతాత్ముడై శరణు వేడి ఇకముందెన్నటికిని సో
మనాద్రి జోలికి రాసని ప్రాధేయపడి ప్రాణముల గాచుకొ
నెను. కాని తనయుద్ధచిహ్నములగు నగారా, పచ్చజండాను,
ఏనుగును, ఇచ్చుకొన వలసినవాడయ్యెను.

మరునాడు ప్రాతఃకాలమున సయ్యదు తనకోటపై కెక్కి
గద్వాలదిక్కు చూడగా తనపచ్చ ఝుండా కనబడెను. కడు
పులో మసిబోసినట్లయ్యెను. తనపల్లకీని సిద్ధము చేయించి హై
ద్రాబాదు నగరమును చేరికొని నిజాముతో తన దైన్యస్థితినం
తయు చెప్పుకొనెను. నిజా మెన్నియో విధముల వారింపజూ
చెను కాని సయ్యదు తాను పట్టినపట్టు వదలకపోయెను. యుద్ధ
ము తప్పదయ్యెను. నిజాము ప్రబలసైన్యముతో బయలుదేరె
ను. పూర్వము పరాభూతుడైన రాయచూరు నవాబున్ను,
శాలికి బుద్ధిచెప్పియుండిన ఇమాంసాబున్ను, తమనూత్న పరా



సోమనాద్రి

క్రమముల పరీక్షించుకొనదలచిన గుత్తి దుర్గాధిపతియగు టీకుసుల్తానును, కర్నూలు నవాబగు దావూద్ ఖానును నిజాము సహాయార్థము సేనలతో వచ్చిచేరిరి. యుద్ధరంగము కర్నూలునకు పరువుదూరములో తుంగభద్రా తీరముననున్న నిడుదునూరను గ్రామము. తుంగభద్రకు దక్షిణతీరముననుండు నీనిడుదునూరున నిజాము సైన్యమును, తుంగభద్ర కుత్తర తీరముననున్న కలుగోట్లయను గ్రామమున సోమనాద్రి సైన్యమును విడిసెను. ఈ రెండు గ్రామములందు నేటికిని ఆనాటియుద్ధ చిహ్నములగు తాత్కాలి కావు బురుజులును, మిట్టలును కానబడును.

సోమనాద్రిది ఆరడుగుల ఎత్తుగల గంభీర విగ్రహము. నల్లని కర్కశకాయుడు, సాముచే కండలుతిరిగిన దీర్ఘబాహువులు కలవాడు. ఆప్తులకు గంభీరుడును, శత్రులకు ప్రళయ రుద్రమూర్తియు నైనవాడు. అతని ప్రత్యేకవాహనము ఒకగొప్ప తెల్లనిగుర్రము. దానిపై స్వారిచేయుచు అతడు యుద్ధము చేయ మొదలిడిన అజేయుడై యుండెడివాడు. సోమనాద్రియే మొదట తుంగభద్రనుదాటి తెల్లవారకముందే నిజాము సైన్యముపై బడెను. శత్రుసైన్యములో చాలమంది సాయంకాలము వరకు హతమైరి. చీకటి పడినతోడనే సోమన్న తన సైన్యమును మరల్చి నదినిదాటి కలుగోట్లను చేరుకొని విశ్రమిం

చెను. నిజాముదర్బారుచేసెను. "సోమనాద్రిని వంచుటెట్లు?" అనునదే అందరను ఆందోళనపరచిన ప్రశ్న. అందొకసర్దారిట్లనెను. "సోమనాద్రి శక్తియంతయు అతని గుర్రమందే యున్నది. దాని నపహరించినగాని సోమన్న వశముగాడు". ఆ గుర్రమును నపహరించుటెట్లు అని ఆలోచించి నిజాంగారు ఇట్లు తన సైన్యములో ప్రకటన గావించెను, "ఎవ్వడు సోమనాద్రి గుర్రమును తెల్లవారులోపల తేగలడో వానికొక జాగీరు నిత్తును." తెలిసి తెలిసి యమునిబారి నెవడు పడగోరును? తుదకొక సైనుసిద్ధమయ్యెను. నడుములో కళ్ళెమును బిగించి ఒంటిగా బాటపట్టెను. వాడుబయిలుదేరిన కాలము మంచిది. సోమనాద్రి గుర్రమువద్ది కావలివాండ్రు పగలంతయు అలసి సొలసి గుర్రుపెట్టి నిద్రించుచుండిరి. చప్పుడుకాకుండ గుర్రమునకు తన కళ్ళెము తగిలించి పాగానుండి దానిని తప్పించి స్వారియై తన వచ్చినబాట పట్టెను. నిజాంగారికి పట్టరాని ఆనందముకలిగెను. వెంటనే ఆసైనుకొక బంగారు కడియము ఇనాముగా నిచ్చెను.

భల్లున తెల్లవారెను. ఇట సోమన్న భూపాలుని సైన్యములో రాజుగారి గుర్రము లేకుండుటవలన సంతాప మతిశయించెను. గుర్రములేకుండుట తన దక్షిణహస్తము పడిపోవుటగా సోమభూపాలునికి తోచెను. ఆనాడంతయు మొటులో యుద్ధము జరిగెను. తుదకు సాయంకాలమగుట ఉభయసైన్య

ములు యుద్ధము చాలించెను. సోమనాద్రి యారాత్రి తనవా
రితో సమాలోచనచేసి యిట్లుప్రకటించెను, "నాగుఱ్ఱమును
రేపు తెల్లవారువర కెవ్వడు తేగలడో వానికి నాగుఱ్ఱము ఒక
దినమంతయు నెంతభూమి తిరుగునో అంతభూమి శాశ్వతముగా
ఇనాముగా నివ్వగలను."

గద్వాలకు పదిమైళ్ళ దూరములో "బొచ్చెంగన్నపల్లె"
అను గ్రామముకలదు. ఆగ్రామమునుండి యొకబోయ సర్దారు
"హనుమప్పనాయుడు" అనువాడు యుదమునకు వచ్చియుం
డెను. అతడు వెనుకముందు లాలోచింపక ముందునకువచ్చి సం
సిద్ధుడయ్యెను. జొన్నదొప్పను ఒకమోపుగా కట్టి నెత్తిన బె
ట్టుకొని నిజాము డేరాలను సమీపించెను. ఒకసిపాయి అతనిని
జూచి "అరేయ్, ఆమోపు యెంతకిస్తావు" అని విచారించెను.
"సీపాయ్‌సాబ్, దండుఇక్కడ విడిసి నప్పటినుండి మేతకరువైం
ది. చుట్టు ఆమడదూరం ఎక్కడా ఒక దంటుపుల్ల దొరుకదు.
ఈ మోపుకు అయిదురూపాయిలు యిస్తేనేకాని యియ్యను"
అని హనుమప్పనాయుడు ప్రత్యుత్తరమిచ్చెను. "అరే, దీవా
నా, అందరూ అర్ధరూపాయి కేయిస్తే నీవు అయిదూ సెప్తావ్
జావ్" అని వికటంగా నవ్వుతూ సీపాయి వెళ్ళిపోయెను. వచ్చి
న సీపాయీ లందరితోను ఇదే సంభాషణ. హనుమప్పకు గు
ఱ్ఱములపైననేకన్ను. పోగాపోగా నొకప్రత్యేక స్థలములో సో
మనాద్రి గుఱ్ఱమును గట్టి యున్నది చూచెను. గుఱ్ఱముకూడ

హనుమప్పనాయునిచూచి గుర్తించి నకిలించెను. గుర్రమువద్ది జవానులు హనుమప్పను ఎగాదిగ జూచిరి. దాని కండ్లలోని కాంతిని, నిక్కించిన చెవులను, భూమిని తట్టుచుండిన ముంగాళ్లను, తత్తరపాటుచూపు శిరఃకంపమును చూచి ఇట్లుమాట్లాడుకొనుచుండిరి. అరేభాయ్ ఇదీ ఘోడా రేస్‍కిసీమలో దంటు పుల్లలు తిన్నట్టిది. అందుకోసమే చొప్పనుచూచి యికిలిస్తుంది. ఠీక్ ఠీక్ అని యందరును ఈయభిప్రాయమును ఏకగ్రీవముగా నామోదించిరి. చొప్పబేరము జరిగెను. హనుమప్ప ఒక్క రూపాయ అనెను చొప్పమోపుదించెను. సిపాయి లోకనితో ఖరీదిప్పించుమని చెప్పివెడలిపోయెను. కొంతసేపటికివాడు హనుమప్పకు ఖరీదిచ్చి వెడలిపోయెను. మరికొంతవడి కొకడువచ్చి నీవెవరు అనివిచారించగా "అయ్యాబీదవాన్ని వచ్చిగంటసేపాయె, ఎవరోఒకసాయెబఃయ్య చొప్పఖరీదు తెస్తానని అట్లేపోయినాడు. మీరన్నా యిప్పించండి" అని దీనముగా బలికెను. వాడుపలుకకుండా తనదారిపట్టెను. ఇంతలో అటునిటుచూచి చుట్టును యెవ్వరులేనిది గమనించి గుర్రము పాగలో మూలనున్న గడ్డికుప్ప తనపైవైచికొని అందు వెల్లకిల చేతులుచాచి పరుండెను. నెమ్మదిగా మేయుచుండిన గుర్రము నాయుని గానక తన్నుకొనుచు కాళ్లనుగట్టిన గూటము నూడబెరికెను. వెంటనే యొకసిపాయి వచ్చి గూటమును గడ్డిపైమోపి భూమిలో పాతదొడగెను. ఆగడ్డిక్రింద హనుమప్ప తనచేతుల చాచి పరుండి

యుండెను. గూటము నాతని యరచేతిపై మోపబడెను. మీాద మీాద దెబ్బ వేయుచుండగా అరచేతిని చీల్చుకొని ఆగూటము భూమిలో గట్టిగా పాతుకొనెను. హనుమప్ప కదలక మెదలక యుండెను. ఎంతనొప్పిగలిగినను, ప్రాణములు పైననే లేచిపోవునట్లుండినను తనస్వామికార్యమును తలచుకొని నిగ్రహించికొనియుండెను. నడిరేయియయ్యెను. సిపాయీలందరు నిద్రించియుండిరి. ఢేరాలన్నియు మాటు మణిగియుండెను. తిన్నగా తనపై గడ్డిని బ్రక్కకుద్రోసి హనుమప్ప లేచికూర్చునెను. కుడిచేయి కదలించుటకు వీలులేకపోయెను. గూటముకూడ కదలకపోయెను. ఎడమచేతతననడుములోనిఛురికను లాగి ఒక్కవ్రేటున కుడిచేయి నరుకుకొనెను. మూర్ఛితుడయ్యెను. మరల సేద దేరి రక్తప్రవాహముతోనుండు మొండిచేతిని తలపాగాతో చుట్టి, గుర్రమును తీసుకొని స్వారియై ఢేరాలుదాటెను. అక్కడక్కడ నిద్రించు సిపాయీలు తలలెత్తిచూచిరి. నిజాముసైన్యములో విరామములేక గుర్రములను ఏటికి నీరుద్రాపుటకై తీసికొనిపోయి వచ్చుట పరిపాటియగుటచే ఏ సైసో గుర్రమును ఏటికి తీసుకొని పోవుచున్నాడని భ్రమించి మరలనిద్రించిరి. అరగంటలో హనుమప్ప సోమనాద్రియెదుట గుర్రముతోసహా హాజరయ్యెను. రాజుగారిని నిద్రనుండిలేపి యెడమచేత సలాముచేసి నిలబడెను. రాజు కోపముతో కన్నెర్రచేసెను. హనుమప్ప తన మొండిచేతిని చూపించెను. రాజుగారు కారణమడుగగా

జరిగినదంతయు చెప్పెను. రాజాశ్చర్య చకితుడయ్యెను. నాయుని కౌగిలించి సన్మానించెను. అప్పుడే యొక దానశాసనము వ్రాసియిచ్చెను. యుద్ధానంతరము తనవాగ్దత్తప్రకారము గుర్రము ఒకదినముతిరిగినంతభూమి హనుమప్పనాయునికి ఇనాముగా నిచ్చెను. నేటికిని బొచ్చెంగన్న పల్లెలో హనుమప్ప సంతతివారు ఆభూముల ననుభవించుచున్నారు. తమకాభూములు చాలినవేకాక అందులోమరల తామున్న ఇతరుల కినాముగా కొంతభాగమిచ్చియున్నారు.

సోమభూపాలుని యుత్సాహము ప్పొంగెను. ప్రాతఃకాలమున ఆతనిదండు అంతయు వికాసముతో నుండెను. అట నిజాము సైన్యము సమీపించుకొలది అతని జయభేరియొక్క భయంకర ధ్వానములు స్ఫుటముగుకొలది ప్రతిపక్షసైన్యములోని ప్రతివానియెదలో దడదడహెచ్చయ్యెను. సోమనాద్రిసైన్యము దావానలమువలె నిజాంసైన్యము చుట్టుకొనెను. యుద్ధము భయంకరరూపముదాల్చెను. ఆనాటియుద్ధములో ప్రాగటూరు, బల్లారి, ఆదోని నవాబులు పాలికలని కాహుతులైరి. సాయంకాలము సమీపించువరకు కర్నూలుకోటవరకు నిజాము సైన్యములు తరుమబడెను. సోమనాద్రియు కొలదిమంది భటులతోనే ఆసైన్యమును వెన్నంటిలోపల ప్రవేశించెను. అంతలో కోటతలుపులు బంధింపబడెను. సోమనాద్రిలోపల అతని సైన్యము వెలుపల. గద్వాల సర్దారులకు భయముకలిగెను. కో

టను పగులజీల్ప బహుప్రయత్నములు జేసిరి. అంతయు నిష్ఫల మయ్యెను. తెల్లవారెను. కోటలోపలి వార్తలేమియు తెలి యకపోయెను. గద్వాల సర్దారులు తమ యేలిక చచ్చెనేమో యని నిశ్చయించి గద్వాలలో లింగమ్మ రాణీకి తాము తిరిగి వత్తుమని వార్త పంపిరి. ఆవీరనారి వారికి ప్రత్యుత్తరముగా కొ న్నిగాజులు, చీరలు, పసుపుకుంకుమ పంపెను. గద్వాల సర్దా రులకు క్రోధము, సిగ్గును కలిగెను. ద్విగుణీకృత ప్రయత్నము తో కోటపైబడి ద్వారములు పగులజీల్చిరి. సోమనాద్రియు కోటలోపల తన కొలదిమంది యనుచరులతోనే రాత్రియంత యు మరుదివసమంతయు ఘోరముగా పోరాడుచు అనేక శ త్రుప్రులను నరుకుచు ప్రాణములపై ఆశ వదులుకొని యుద్ధ ము చేయుచుండెను. తనయనుచరులలో చాలమంది హతమై రి. తానును గాయము పొందియుండెను. తుదకు కోటతలుపు లు పగులగొట్టబడగా బయటబడి తనసైన్యముతో తన గుడా రములు చేరుకొనెను.

నిజాంసైన్యములో అలజడి హెచ్చిపోయెను. పిడికెడు మందితోడనే సోమనాద్రి కోటలో అల్లకల్లోలము నొనర్చి తప్పించుకొనిపోయెను. రేపు తెల్లవార ఇంకేమిచేయనున్నా డో? చావగా మిగిలిన గుత్తిరాయచూరు నవాబులు యుద్ధవి ముఖులైరి. సోమనాద్రితో సంధిగావించుకొనుడని నిజాము గారికి మంత్రాలోచన చెప్పిరి. యుద్ధమునకు కారణభూతుడైన ఉప్పేడు సయ్యాదు ఏమియులోచనివాడై తూష్ణీంభావము

వహించియుండెను. నిజాంగారు మరునాడుదయముననే యొక రాయబారినంపి సంధికోరెను. సోమనాద్రియు అంగీకరించెను. యుద్ధ పరిణామముగా కర్నూలులోని కొండారెడ్డి బురుజున నుండు "యెల్లమ్మఫిరంగి"యను చాలాగొప్ప ఫిరంగిని గోన బుద్ధారెడ్డిచే చేయింపబడినవని ప్రతీతిగలిగి రాయచూరు నవాబు వశమందుండిన "రామ", "లక్ష్మణ" అను పేరులుగల రెండు ఫిరంగీలను సోమనాద్రి తీసికొనెను. కర్నూలులో కొంతభాగము సోమనాద్రికియ్యబడెను. ఈప్రకారము సంధిగావించుకొని సోమభూపాలుడు విజయోత్సాహముతో తనరాజధానికి మరలెను.



# ఆంధ్ర ఇన్సూరెన్సుకంపెనీ,లిమిటెడ్.

హెడ్డాఫీసు:- మచిలీపట్టణము,

భీమాచేయుట ప్రతిమానవుని విధి! ఎందుకన జీవమున కెట్లు ప్రాణవాయువవసరమో అట్లే మానవునికి ఆర్థికస్వాతంత్ర్యము.

అట్టి

ఆర్థిక స్వాతంత్ర్యమును ఆంధ్ర "భీమాపట్టా"యొసగును.

కావున

ఆంధ్రలో ఆలసింపక తడబడక భీమాచేసిన తమ భార్య బిడ్డల భావిజీవిత సౌఖ్యమును, తమ వృద్ధాప్యములో నిర్విచార జీవమును బడయుదురు.

## 'ఆంధ్ర'

దినదినాభివృద్ధిగాంచుచు ప్రజల నమ్మకమును, స్థిరత్వమును, పెంపొందించుకొనుచున్నదను సంగతి యీ గ్రంధకర్తగారి ప్రశంసయే తెలుపుచున్నది.

ప్రశంస. "ఆంధ్ర ఇన్సూరెన్సుకంపెనీ ఆంధ్రులచే స్థాపింపబడిన భీమా కంపెనీలలోకెల్ల మొట్టమొదిటిది. తన యీ స్వల్పజీవితములోనే చేసిన వ్యాపారమువల్ల భారతీయ భీమా కంపెనీలలో ప్రాముఖ్యత గడించినది. ఇట్టి యీ సంస్థను ప్రోత్సహించ వలసినదిగ సోదర, సోదరీ మణులనుకోరుచున్నాను.

ఇట్లు

(సం) సురవరము ప్రతాపరెడ్డి

---

# దేశీయపరిశ్రమలను ప్రోత్సహించండి.

భారతదేశములో వేనవేలు కర్మాగారములు ఉద్భవించి విదేశ పెట్టుబడిదారులచే అంత్యమొందింపబడినవి.
కాని భారతీయ గౌరవపతాకమును

గోలకొండ




సిగరేటు

నేల వ్రాలనివ్వలేదు.

నిర్మాతలు:—

## హైద్రాబాద్ దక్కన్ సిగరేటు ఫ్యాక్టరీ

హైదరాబాదు. దక్కన్.

# గోలకొండపత్రిక.

## ప్రప్రథమజాతీయ ద్వైవారపత్రిక.

(ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును)

| వార్షికమూల్యము | | ప్రకటన రేట్లు | |
|---|---|---|---|
| సంవత్సరమునకు | ౬-౦-౦ | ౧నుండి ౫౦ అంగుళములవరకు అంగుళం౧కి | ౧-౦-౦ |
| ఆరునెలలకు | ౩-౦-౦ | | |
| విడిపత్రిక | ౦-౧-౦ | ౫౧ ,, ౧౨౦ ,, | ౦-౧౨-౦ |
| | | ౧౨౧ ,, ౩౦౦ ,, | ౦-౮-౦ |
| (ఆరునెలలకు తక్కువగా అంగీకరించబడదు.) | | ౩౦౧ ,, ౫౦౦ ,, | ౦-౬-౦ |
| | | ౫౦౧ ,, అంతకుపైగా | ౦-౪-౦ |

(ఈ అంగుళములు ప్రత్యేకించుకొని సం॥ రకాలములో ముగించుకొనవలెను.)

### లభించు గ్రంథములు.

| | | |
|---|---|---|
| కథాకల్లోలిని | ౧-౬-౦ | |
| సుధాలహరి | ౦-౧-౬ | కౌలునామాలు ౧౦౦కి రూ. ౨ |
| కృష్ణాలహరి | ౦-౧-౬ | |
| హాలీకల్దారుజంత్రి | ౦-౨-౦ | |
| రెడ్డికులనిర్ణయచంద్రిక | ౧-౦-[illegible] | కుబూలియతులు ౧౦౦కి రూ. ౨ |
| భగవద్గీత | ౦-౬-౦ | |
| బతుకమ్మపాట(హరిశ్చంద్ర) | ౦-౧-౬ | పాంసరీనోట్లు ౧౦౦కి రూ. ౨ |
| గోలకొండ సంవత్సరాదిసంచిక ధాత, ఈశ్వర | ౧-౦-౦ | |

# ‘ఆంధ్రవాణి

## జాతీయ అర్ధవార పత్రిక

ప్రపంచ ముఖ్యవార్తలేగాక, రాచకీయ, ఆర్థిక, సారస్వతాది సమస్యలపై ప్రవీణుల వ్యాసములును, నిష్పాక్షిక విమర్శలును, ఉత్తమ శ్రేణికి జెందిన కథానికాది సారస్వతమును ‘ఆంధ్రవాణికి, అమూల్యాలం కారణములు.

సుమారు ౧౦ లక్షల ఆంధ్రులకు ఉనికిపట్టయిన నిజాం రాష్ట్రమునకు అవసరమైన స్థాన మొసగుట “ఆంధ్రవాణి” ప్రత్యేక లక్షణము. ఆంధ్ర హృదయమును ప్రస్ఫుటముగా ప్రతిబింబింప జేయుట “ఆంధ్రవాణి” ప్రధానాశయము.

ఆంధ్రుడు వసించు ప్రతి ప్రదేశమున విరివియైన వ్యాప్తికి వలయు నేర్పాట్లు చేయబడుటచే “ఆంధ్రవాణి” ప్రకటన కర్తలకు తగిన ప్రతిఫలము నిచ్చును “ఆంధ్రవాణి” ని ఆదరించి, పోషించు భారము ఆంధ్ర మహా జనులదే యని మనవి.

చందా:- సంవత్సరమునకు రూ. ౬—౦—౦

ప్రకటన రేట్లు మొదలగు వివరములకు:

“ఆంధ్రవాణి”
కార్యాలయము;
బెజవాడ.

బ్రాంచి ఆఫీసు: ముకర్రంజాహి రోడ్డు,

# హిందువుల పండుగలు

గ్రంథకర్త:— సురవరము ప్రతాపరెడ్డిగారు.

ముఖ్యముగా ఆంధ్రులకు అవసరమైన గ్రంథము. ఇం దు ౫౦ పండుగలు ౩౧౦ల పుటలలో సచిత్రముగా, విపులము గా వర్ణించబడినవి. ఇట్టి గ్రంథము ఆంధ్ర దేశములోనే కాదు భారత దేశములో కూడా ఇదవరకెవరును, ఎప్పుడును వ్రాసి యుండలేదు. యీ గ్రంథముయొక్క ఘనతను చాటుటకంటె రెండవ ప్రచురణమనిన మీకే తెలియగలదు.

వెల ౧—౦—౦

గోలకొండ పత్రికా కార్యాలయము

హైద్రాబాదు- దక్కన్.

# గోలకొండ కవులసంచిక.

సంపాదకుడు. సురవరము ప్రతాపరెడ్డిగారు,

తెలంగాణా ౩౫౪ కవులచే అలంకరింపబడిన ౪౫౦ పుటల గ్రంథము.

గోలకొండ చందాదారులకు ... ౧-౦-౦

ఇతరులకు ... ... ౨-౦-౦

ప్రకాశకులు

గోలకొండ పత్రికాకార్యాలయము

ట్రూపుబజారు, హైద్రాబాదు; దక్కన్.

---

# నిజాంరాష్ట్రపరిపాలన

గ్రంథకర్త:—సు। ప్రతాపరెడ్డిగారు.

నిజాంరాష్ట్రపు పుట్టు పూర్వోత్తరములనుండి
కును పరిపాలనావిషయములను విపులముగా వర్ణించబ
గ్రంథము.

చందాదారులకు ౦·
ఇతరులకు

గోలకొండ పత్రికా కార్యాలయము. హైద్రా